శ్రీః

దైవజ్ఞ శ్రీ సూర్యకవి విరచితమ్

# రామకృష్ణవిలోమకావ్యమ్

ఆంధ్రవ్యాఖ్యయా 'ద్విరసనాఖ్యయా' అలఙ్కృతమ్

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విశేషములు)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రీ



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

KMR01A125

To
Mr. G. గుణశేఖర గారికి
with best wishes
from
(signature)
10/7/09

శ్రీః

దైవజ్ఞ శ్రీ సూర్యకవి విరచితమ్

# రామకృష్ణవిలోమకావ్యమ్

ఆంధ్రవ్యాఖ్యయా 'ద్విరసనాఖ్యయా' అలఙ్కృతమ్

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విశేషములు)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రీ



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

శ్రీః

దైవజ్ఞ శ్రీ సూర్యకవి విరచితమ్

# రామకృష్ణవిలోమకావ్యమ్

ఆంధ్రవ్యాఖ్యయా 'ద్విరసనాఖ్యయా' అలఙ్కృతమ్

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విశేషములు)

మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రీ

ప్రథమముద్రణ :-25. 10. 2003 - స్వభాను - దీపావళి పర్వదినం

ప్రతులు : 1000

పేజీలు : 48

వెల రూ. : 20-00



4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, Chirala - 523 157, Prakasam Dist. A.P.
Ph.No.: 08594 - 234054

2. సాధన గ్రంథ మండలి - తెనాలి - 522 201.

DTP by
**VIKRAM GRAPHICS**
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 237658

Printed at
**KAMALA ART PRINTERS,**
**TENALI.**
Ph. : 202972, 225072

# పరిచాయిక

ఈ కవి క్రీ.శ.16వ శతాబ్ది పూర్వార్ధము వాడు. ఈయన దైవజ్ఞుడు అనగా జ్యౌతిషికుడయిన కవి అని తెలియుచున్నది. ఈయన సూర్య ప్రకాశము, లీలావతి అను జ్యౌతిష, గణిత గ్రంథాలకు టీకలు గూడా వ్రాసెను.

ఈ రామకృష్ణ విలోమకావ్యమునందు 36 శ్లోకములలో రామకృష్ణ కథలను రచించెను. ఇందులో 'ఇంద్రవజ్ర, శాలిని, రథోద్ధత, అనుష్టుప్, విద్యున్మాల' అను వృత్తములను వాడెను. దీనియందు ఈయన వాడిన యమకము సభంగము. గతప్రత్యాగతము.

ఈ ప్రక్రియ భారవి వ్రాసిన కిరాతార్జునీయములో *14*వ సర్గలో కొద్దిగా కలదు.

భారవి వ్రాసిన కిరాతార్జునీయములో *14*వ సర్గలోని
*20, 22, 23* పద్యాల ప్రతిపదార్థము, తాత్పర్యము

**శ్లో॥ నను హో మథనా రాఘో ఘోరా నాథమహో నున,**
**తయదా తవదా భీమా మాభీదా బతదాయత॥** ***20***

సందర్భము:- కిరాతార్జునుల యుద్ధములో కిరాతేశ్వరుని పక్షమున అర్జునునిపైకి యుద్ధమునకు వెళ్ళిన ప్రమథగణములు ఓడి వెనుదిరిగినవి. ఆ గణములతో కుమారస్వామి పలికిన మందలింపు మాటలు ఇవి.

ప్రతిపదార్థము:- ననుహో=ఓ ప్రమథులారా!, మథనాః=శత్రువులను మథించు వారును, రాఘః=సమర్థులును, ఘోరాః=భయంకరులును, నాథ =ఈశ్వరుని, మహాః=పూజించువారును, తయ=రక్షకులును, దాత= శుద్ధమయిన వారును, వదాః=వక్తలును, భీమాః=భయంకరులును, మాభీదాః=అభయప్రదులును అగు మీరు, న దాయత, ను=శుద్ధమయిన వారు గాదా, బత=అయ్యో!.

**తాత్పర్యము:-** ఓ ప్రమథులారా! మీరు శత్రు మథనము చేయగల దిట్టలు. భయంకరులు. శివ కింకరులు. లోక రక్షకులు. నిర్మల కీర్తిమంతులు. ప్రగల్భవక్తలు. లోకమునకు అభయప్రదులు. అట్టిమీరు ఏల అపవిత్రముగా వెనుదిరిగితిరి.

వ్యాకరణ విషయాలు:

1) రాఘృసామర్థ్యే - క్విప్=రాఘః=బహువచనము. సమర్థులు అని అర్థము.
2) హో=ఆహ్వానే
3) మహః=మహయంతి=పూజయంతి-క్విప్
4) తయః=తయరక్షణే-క్విప్
5) దాతాః=దైప్‌శోధనే-క్త ప్రత్యయః
6) మాభీదాః=నఞర్థక 'మా' శబ్దస్య సుప్సుపేతి సమాసః అభయప్రదాః ఇతి అర్థః.
7) బత=వబయోరభేదః-వత
8) న, దాయత, ను - దైప్ శోధనే లోట్ మధ్యమ పురుష బహువనచమ్.

శ్లో॥ నిశితాసి రతో భీకో న్యేజతే మరణారుచా
సారతో న విరోధీ నః స్వాభాసో భరవానుత॥ 22

సందర్భము:- పై శ్లోకము వలె.

ప్రతిపదార్థము:- అమరణాః=ఓ దేవతలారా! నిశితాసి=పదునయిన కత్తియందు, రతః=ఆసక్తిగలవాడు, అభీకః=భయములేనివాడును, రుచా=కాంతితోగూడిన వాడును, స్వాభాసః=అందమయిన వాడును, ఉత=మిక్కిలి, భరవాన్=భారము భరింపగలవాడును, అగు, నః=మన, విరోధీ=శత్రువయిన సవ్యసాచి, సారతః =బలము నుండి, న న్యేజతే=కదలుట లేదు.

తాత్పర్యము:- ఓ ప్రమథులారా! మీరు మరణము లేని వారు. మన శత్రువు ఖడ్గవీరుడు. రణభారము భరింపగల సమర్థుడు. కాంతిమంతుడు. అతడు మానవుడయినను, యుద్ధమున అతని బలము చెక్కుచెదరలేదు. మీరు కూడా అతనివలె యుద్ధమున నిలువవలెను.

22వ పద్యమునే విలోమముగా వ్రాయవలెను.

శ్లో॥ తనువారభసో భాస్వా నధీరో వినతోరసా
చారుణా రమతే జన్యే కో భీతో రసితాశిని॥ 23

సందర్భము:- పై శ్లోకము వలె.

ప్రతిపదార్థము:-తనువార=కవచము చేత, భసః=ప్రకాశించువాడును, భాస్వాన్=

కాంతిమంతుడును, చారుణా=అందమయిన, అవినత=ఎత్తయిన, ఉరసా= వక్షస్థలముతో కూడినవాడై, రసిత=గర్జనల చేత,ఆశిని=తినివేయునట్టి, జన్యే= యుద్ధమునందు, అధీరః=ధైర్యము లేని, కః=ఎవడు, అభీతః=భయము లేనివాడై, రమతే=క్రీడించును?

**తాత్పర్యము:-** కవచధారి అయి, ఔొమ్ము ఎదురొడ్డి సింహగర్జనలతో భయంకర మయిన యీ యుద్ధములో నిర్భయముగా నిలిచిన అర్జునుడు ధీరుడు కాక మరెవ్వడు?

**వ్యాకరణ విషయములు:**

(1) ఉత-అతి,
(2) న్యేజతే-కంపతే-ఏజృ-చలనే,
(3) భసః-భసదీప్తౌ-పచాద్యచ్

ఈ 'ప్రక్రియ' సాహిత్యపరమయిన 'సర్కసు' లేదా 'రజ్జుగమనము' అని చెప్పవచ్చును. ఈ కావ్యములో రసముండదు, నీరసమయిన యమకము మాత్రమే. కాని కవి ప్రతిభ పాఠకులకు ఆశ్చర్యము కల్గించును. దీనివలన సాధ్యమయిన కావ్యప్రయోజనము కవిపరముగా 'కీర్తి, ఆనందము, ధనము' మాత్రమే. పాఠకులకు 'ఆశ్చర్యము' మాత్రమే లభించును. 'కుండల దొంతర నృత్యము' లేదా 'పళ్లెపు నృత్యము' వలె ఒక ప్రక్రియగా ఇది ఆశ్చర్యకరము.

క్లిష్టమైన ఈ ప్రక్రియను నిర్వహించుట చాలా పెద్ద పని. కనుక దీనికి కొన్ని సానుభూతి పూర్వకమయిన పరిహార సౌకర్యములు కావలయును. అప్రయుక్తములు, క్లిష్టాన్వయము, మధ్యకథాలోపము, అన్యార్థములు, నేయార్థములు, లక్షణలు, హ్రస్వదీర్ఘములు, విసర్గానుస్వారములు, అక్షర వ్యత్యాసములు, ఏకాక్షర పదములు మొ॥ అంగీకరణీయమయిన దోషములు.

అయితే యీ గ్రంథములో మెచ్చదగిన విషయమేమనగా; నానార్థములు, ఏకాక్షరములు వాడనని కవి ప్రతిజ్ఞ చేయుట. ఆ ప్రకారము ఇంతటి క్లిష్ట ప్రక్రియను సాధారణ పదములతోనే నిర్వహించినాడు. సహజక్లిష్టత మాత్రం ప్రక్రియను బట్టి తప్పదు. కనుక ఈ సాహిత్య వ్యాయామాన్ని వీక్షించి కవికి గల 'పాండిత్య' కండబలమును గ్రహించి ఆనందింపవలసినది.

ఇందులో కొన్నిచోట్ల కవి చెప్పిన అర్థమును త్రోసిరాజని, నేను సొంత అర్థములను సూచించితిని. అయితే కవికన్న వ్యాఖ్యాతకు ఎక్కువ తెలియునా? అన్న ప్రశ్నకు సమాధానము. మన పిల్లల గుణగణాలు మనకు అన్నియు తెలియవు. అట్లే తమ కవితలలోని గుణదోషాలు కవులకయినను కొన్ని స్ఫురింపవు. కనుకనే కావ్యదోషాలు ఏర్పడును. ఆవేశములోనున్న కవి కొన్ని విషయములను గమనించలేదు. అవి గుణములయినను, దోషములయినను వెలిదీయుటకు విమర్శకులే అవసరము.

కనుకనే వాల్మీకి తననుండి వచ్చిన ఆదిశ్లోకము గూర్చి తానే ఆశ్చర్య పడెను. దానిలో రామాయణార్థము ఆయనకు తెలియకుండగనే తొంగి చూచినది. దానినే బ్రహ్మ ప్రస్తావించెను. కనుక వాగర్థ విలాసజన్యమయిన విభ్రమ పరంపరలను గమనించుటకు విమర్శకశతము అవసరము, ఒక్క కవి ఎంత?

ఈ 'ప్రహేళికా' కేళిని మనముందు అచ్చు రూపములో 'ఆంధ్రవ్యాఖ్య'తో తెచ్చిన శ్రీ రావి మోహనరావుగార్కి రామకృష్ణుల ఆశీస్సులు లభించునుగాక అని కోరుకొనుచున్న

తమ
మేళ్ళచెర్వు వేఙ్కటసుబ్రహ్మణ్యశాస్త్రి
"సుబ్రహ్మణ్యో ద్విరసనో రామశ్యామసదానుగః
సుబ్రహ్మణ్యో ద్విరసనా రస్య ద్వైవాంధ్ర కావ్యకః"

శ్రీః

దైవజ్ఞ శ్రీసూర్యకవి విరచితం

# రామకృష్ణ విలోమ కావ్యమ్

ఆంధ్రవ్యాఖ్యయా 'ద్విరసనాఖ్యయా' అలంకృతమ్



శ్లో॥ శ్రీమన్మంగళమూర్తి మార్తిశమనం నత్వా విదిత్వా తతః
శబ్దబ్రహ్మమనోరమం సుగణకజ్ఞానాధిరాజాత్మజః।
యద్గ్రంధాధ్యయనైః వినేయనివహో ప్యాచార్యచర్యామగాత్
సోఽహం సూర్యకవిః విలోమరచనం కావ్యం కరోమ్యద్భుతమ్॥

భావము:- బాధానివారకుడయిన మంగళ స్వరూపునికి నమస్కరించి, మనోహరమైన శబ్ద బ్రహ్మమును తెలిసికొని నేను ఈ గ్రంథమును రచించితిని. గొప్ప జ్యౌతిషికుడయిన జ్ఞానాధిరాజు నాతండ్రి. నా గ్రంథములు చదివిన శిష్యులందఱు ఆచార్యులయినారు. నాపేరు సూర్యకవి. నేను అద్భుతమయిన విలోమకావ్యమును రచించుచున్నాను.

శ్లో॥ ఛందః పూరణ ముత్క్రమక్రమవిధౌ సాకాంక్షతా తత్పదే
ష్వారంభాచ్చరితే క్రమోపి సుతరా మేతత్త్రయం దుర్గమమ్।
ఏవం సత్యపి మన్మతిః కియదపి ప్రాగల్భ్యమాలంబతే
తత్సర్వం గుణినః క్షమంతు యదహో యూయం శ్రమజ్ఞాః స్వయమ్॥

భావము:- ఎదురుబదురు వరుసలలో ఛందస్సును పూరించుట, ఆ పదముల మధ్య అన్యోన్యసమన్వయమయ్యే సంబంధము, ప్రారంభస్థాయినుండి చరిత్రలో సరిఅయిన క్రమము కుదురుట - ఈ '3' విషయములు చాలా కష్టము. అయినను నాబుద్ధి యీ విషయమున సగర్వముగా దూకుచున్నది. గుణవంతులయిన పండితులు ఈ ప్రౌఢిమను క్షమించెదరు గాక. మీకు పండితశ్రమ తెలియును కదా!.

శ్లో॥ కదాచిదపి సంతరేత్ కృతిపరో నరో నీరధిం
కథంచిదపి ధావతి ప్రవరధామ ధారాధ్వని

ఋతేఽ ప్యతివిశారదా ప్రచురశారదానుగ్రహమ్
విలోమకవితాకృతౌ సుకవిధీరధారా భవేత్॥

భావము:- ప్రయత్నశీలుడయిన నరుడు సముద్రమునుదాటగలడు. అగ్నితేజము 'ధారా' మార్గమున ఎట్లో వెళ్లవచ్చును గాక. ప్రబలమయిన సారస్వతానుగ్రహము లేనిదే విలోమ కావ్యరచనలో కవిబుద్ధికి 'ధార' లభింపదు. ఇందులో '2' ఉపమానములలో ఒకటి రాముని సముద్రతరణమును రెండవది కృష్ణుని యమునానదీ తరణమును (వానలో) తెలుపును.

శ్లో॥ భాగీరథీ రామకథాతిరమ్యా కాలిందికా కృష్ణకథా మనోజ్ఞా।
సరస్వతీ సూర్యకవేః తృతీయా స్నాతుం ప్రయాగేఽ త్ర మతిః కవీనామ్॥

భావము:-ఈ కావ్యము 'ప్రయాగ' క్షేత్రమువంటిది. ప్రయాగలో గంగాయమునా సరస్వతీ నదులు కలియును. అట్లే ఈ గ్రంథములో 'రామకథ' అనే గంగ 'కృష్ణకథ' అనే యమున సూర్యకవి (తాను) గారి కవిత్వమనే 'సరస్వతి' గలవు ఈ మూడు కలిసిన ప్రయాగవంటి యీ గ్రంథములో మహాకవులు స్నానము చేయుదురు గాక!

శ్లో॥ సమాక్షరాంఘ్రిః విషమాక్షరార్థా ద్వేధా భవేత్ వ్యస్తకవిత్వసీమా।
సమాన భిన్నార్థతయా ద్విధాద్యా భిన్నాక్షరార్థా చ భవేత్ ద్వితీయా॥

భావము:- చిత్రకవిత్వమున '2' రకములయిన పాదనిర్మాణము కలదు. అందు మొదటిది 1,4 పాదములు సమానముగా 2,3 పాదములు సమానముగా నుండుట. ఇది సమానమయిన భిన్నార్థములు కలది. ఇక రెండవది; భిన్నమయిన అక్షరములు గలది. ఇందు మొదటిదానికి ఉదాహరణము '2'వ పద్యము. రెండవ దానికి ఉదాహరణము '1'వ పద్యము.

అవతారిక:- అథ కవిత్వ పరిభాషా పింగలాదౌ కథితా

శ్లో॥ అధ్యాహారో యత్తదోర్వా క్రియాయాః
పాదాద్యంతే వా విసర్గో విసర్గః।
కుత్రాప్యూహ్యో లక్షణా వ్యంజనా వా
విద్యాదేతాం చిత్రకావ్యానుపూర్వ్యామ్॥

భావము:-కవిత్వ పరిభాష పింగలుడు మొదలగువారిచే చెప్పంబడినది. అందున

చిత్రకావ్యములలో కొన్ని ప్రత్యేక 'మినహాయింపులు' కలవు ఏమనగా, అవసరమయిన పదములను అప్పు తెచ్చుట, యత్, తత్, కొన్ని క్రియలు అట్లు అప్పుతెచ్చుట, పాదాద్యంతములందు విసర్గలు లేదా ఉన్న విసర్గలు లేవని ఊహింపవలయును. అట్లే కొన్ని విషయములలో లక్షణ, వ్యంజనలను గూడ పాఠకులే ఊహించవలయును.

శ్లో॥ నైకాక్షరాణి ఛందోక్తిః
నా ప్రసిద్ధాభిధానకమ్।
నైవ వ్యాకరణక్లిష్టం
ద్రాక్షాపాకోఽత్ర కేవలమ్॥

భావము:- ఇది ఎంత విలోమకావ్యమయినను, ఇందులో ఏకాక్షరపదములను వాడలేదు. అప్రసిద్ధమయిన పదములను వాడలేదు. క్లిష్టమయిన వ్యాకరణ ప్రయోగములు లేవు. ఇష్టమువచ్చినట్లుగా కవిత చెప్పలేదు. కేవలము ద్రాక్షా పాకమే స్వీకరింపబడెను.

అవతారిక:- అథ యయోః కథాప్రసంగః తావేవ ఇష్టదేవతాత్వేన ప్రణమతి

శ్లో॥ తం భూసుతాముక్తి ముదారహాసం
వందే యతో భవ్యభవం దయాశ్రీః।
శ్రీయాదవం భవ్యభతోయదేవం
సంహారదాముక్తి ముతాసుభూతమ్॥

అవతారిక:- కవి ఈ కథానాయకులయిన రామకృష్ణులనే ఇష్టదేవతలుగా స్తుతించుచున్నాడు.

ప్రతిపదార్థము:-(రామకృష్ణపక్షమున)ఉదార=గంభీరమయిన, హాసమ్=చిరునవ్వు గలవాడును, భవ్య=పవిత్రమయిన, భవమ్=అవతారముగలవాడును, యతః =ఎవరినుండి, దయా=దయయు, శ్రీఃచ=సంపదయు కలుగునో, తమ్=అటు వంటి, భూసుతా=సీతాదేవికి, ముక్తిమ్=మోక్షస్వరూపుడైన రాముని, వందే= నమస్కరించెదను.

తాత్పర్యము:- పవిత్రమయిన అవతారమూర్తి, దయాసంపదలకు నిధి, ఎట్టి ఆపదల యందయినను గంభీరమయిన చిరునవ్వును వదలనివాడు, సీతాదేవిని

రావణుని చెరనుండి విడిపించినవాడు అయిన రామునకు గ్రంథ ప్రారంభమున నమస్కరించెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) భవ్య=ఉత్తమమయిన, భ=కాంతిగల సూర్యునకు, తోయ=జలస్వరూపుడైన చంద్రునకు, దేవమ్=కాంతిదాత అయినవాడును, సంహార=చావును, దా=ఇచ్చుటకువచ్చినపూతనకు, ముక్తిమ్= మోక్షరూపముగా అయినవాడును, ఉత= అంతేకాక, అసుభూతమ్= ప్రాణముగా అయివాడును అగు, శ్రీయాదవమ్=యదువంశ సంభవుడైన శ్రీకృష్ణుని, వందే= నమస్కరించెదను.

**తాత్పర్యము:-** సూర్యచంద్రులకు కాంతిదాత, తననుచంప వచ్చిన పూతనకు మోక్షదాత, జగత్తుకు ప్రాణము చైతన్యము అయిన యదువంశ సంభవుడయిన కృష్ణునకు నమస్కారము.

**విశేషములు:-** 1) రామ పక్షమున, ఎటువంటి కష్టములనైన గంభీరమయిన చిఱునవ్వుతో ఎదుర్కొనును అనుటవలన కష్టమయమయిన రామజీవితము ఆయన ఆదర్శ వర్తనము ధ్వనించుచున్నవి. 2) ముందు చిఱునవ్వుతో కృష్ణుడు, తరువాత చిఱునవ్వుతో రాముడు సంభాషించెదరని ఒక శ్లోకము కలదు. రామ శ్యాముల మధ్యఉన్న ఈ 'చిఱునవ్వు' విషయమును కవి యిందు ప్రస్తావించెను. 3)కృష్ణపక్షమున,'**యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్, యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్**' అను భగవద్గీతయు, '**తస్య భాసాసర్వమిదం విభాతి**' అను శ్రుతివాక్యమున్ను భగవంతుడే 'సూర్యచంద్రులకు కాంతి దాత' అను అర్థమును దృఢపఱచును. 4) సర్వప్రాణరూపుడు లేదా చైతన్యరూపుడు అనుటకు '**అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః**' '**ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి**' '**అహం వైశ్వానరోభూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః**' అను గీతా వాక్యములు సాక్ష్యము. 5) అంతేగాక ఆదిత్యాదులందు కాంతి దాతగా నున్నవాడే శరీరములయందు ప్రాణదాతగానున్నాడు. '**తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి**' అను శ్రుతివలన పై '2' విశేషములు క్రమమును పొందినవి. 6) రాముడుగా సీతకు విముక్తిని, కృష్ణుడుగా పూతనకు ముక్తిని ఇచ్చుటవలన భగవంతునకు అందఱు సమాన మనియు, మధురభక్తికి వైరభక్తికి ఫలితము సమానముగా వచ్చుననియు ధ్వని.

అంతర్యామియై పూతనను తన వద్దకు వచ్చునట్లు ప్రేరేపించెను అని భావము. 7) హితాహితులయందు సమానముగా ప్రవర్తించినట్లు చెప్పుటవలన విష్ణు పరముగా ఇది తుల్యయోగి తాలంకార ధ్వని. 8) కలిగెను అని అధ్యాహారము జరిగెను. పద్యము విలోమములో 'శ్రీః' వద్ద ఉన్న సున్నలను 'శ్రీయాద' వద్ద తొలగించికొన వలయును. 'తోయ=నీరు అనగా జలతత్త్వమయిన చంద్రుని లక్షణచేత గ్రహింపవలయును. 'సంహారదా' అనగా 'పూతన' అని ఊహింప వలయును. ఈవిధమయిన సర్దుబాట్లను కవి '6' వ పద్యములో చెప్పియుండెను. గ్రహింప వలసినది.

అవతారిక:- నను దేహవతోఽపి రామాదేః కథం అంతర్యామిత్వమితి ఆశంక్య తుల్యాక్షరయా ఇంద్రవజ్రయా ఆహ.

శ్లో॥ చిరం విరంచిర్న చిరం విరంచిః
సాకారతా సత్యసతారకాసా।
సాకారతా సత్య సతారకాసా
చిరం విరంచిర్న చిరం విరంచిః॥ 2

అవతారిక:- అయ్యా! రామకృష్ణాదులు దేహధారులు కదా! వారు ఎట్లు అంతర్యాములుగానుందురు? అని శంకించి 'ఇంద్రవజ్రావృత్తము' తో చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) విరంచిః=బ్రహ్మ, చిరమ్=సర్వజీవుల దృష్ట్యా చాలాకాలము జీవించును. విరంచిః=అదే బ్రహ్మ, చిరమ్=భగవంతుని దృష్ట్యా చాలాకాలము,న=బ్రతుకడు,సా=ఆ రామునికి సంబంధించిన,సాకారతా=దేహము కలిగియుండుట, సత్య=సత్యమయినదై, సతారకా=విజ్ఞానమయతారక బ్రహ్మ సహిత మయినది. అనగా బ్రహ్మరూపమయినది.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) విరంచిః=బ్రహ్మ, చిరం=లోకదృష్ట్యాశాశ్వతుడు, విరంచిః=బ్రహ్మ (ఆయనయే) చిరం=భగవంతునిదృష్ట్యా శాశ్వతుడు, న=కాడు, సా=ఆ కృష్ణునికి సంబంధించిన, సాకారతా=దేహముకల్గియుండుట, సతీ= సత్యమయి, అనగా నిత్యమయి, అసతారకా=ఆకాశముగూడలేనిదగుచున్నది. అనగా ఆకాశము గూడా దానియందు లీనమగుచున్నది.

**భావము:-** బ్రహ్మ పూర్తిగా శాశ్వతుడుకాడు. ఆయన లోక దృష్ట్యా శాశ్వతుడు. భగవంతుని దృష్ట్యా అశాశ్వతుడు. బ్రహ్మకు గూడ ప్రలయము కలదు. కాని భగవంతుని 'రామ' స్వరూపముగాని కృష్ణ స్వరూపముగాని సత్యమయినవి. బ్రహ్మస్వరూపమయినవి. ఆకాశమును గూడా తమయందు లీనముచేసికొన్నవి. కనుక ఆరూపములు అంతర్యామిగా నుండును.

**విశేషములు:-** 1) **'ఆ బ్రహ్మ భువనాత్ లోకాః పునరావర్తినః'** అను శ్రుతి ప్రకారము బ్రహ్మలోకము గూడా నశించునదే. మఱల పుట్టునదే. 2) **'సతారకా'** అనగా **'తారకము'** అనగా విజ్ఞానమయమయిన తారక బ్రహ్మము అని ఒక అర్థము. తారక=నక్షత్రము. నక్షత్రములు గలది సతారకము అనగా 'ఆకాశము' దానితో గూడిన ఆకారము అనగా 'ఆకాశము' గూడ తనయందు లీనమయిన భగవంతునిరూపము అని మఱొక అర్థము. 3) విజ్ఞానమయమయిన రూపము, ఆకాశాది పంచభూతములను తనయందు లీనముచేసికొనిన రూపము ప్రపంచమున 'అంతర్యామి' అగుట సాధ్యమే అని అర్థము. 4) ఈ పద్యమును కవి 'ఇంద్రవజ్ర' గా చెప్పినాడు. కాని యిది 'ఉపజాతి' వృత్తము. 5) ఈ శ్లోకమున ఏపాదమునకాపాదము ఎటుత్రిప్పిచదివినా ఒకటిగానున్నది. 6) 'విరించిః' అనునది ప్రసిద్ధపదము. 'విరంచిః' అనుపదము లభ్యముకాలేదు. 'విరించః' అని అకారాంతమయిన రూపాంతరము కలదు. కాని 'విరంచిః' అనునది చింత్యము. ఈ పదమును చిత్రకావ్యముకొఱకు కవియిట్లు మార్చి ఉండ వచ్చును. దీనిని గూర్చి కవి ఏమియు చెప్పలేదు. 7) **'శబ్దభేదప్రకాశము'** అను నిఘంటువునందు **'క్వచిన్మాత్రాకృతోభేదః, క్వచిద్వర్ణ కృతోఽత్రచ, క్వచిదర్థాం తరోల్లేఖాత్ శబ్దానాం రూఢితః క్వచిత్' రూపాది భేదేషు విలక్షణేషు విచక్షణో నిశ్చినుయాత్తమేవ'** అని చెప్పినట్లు, 'విరంచి' శబ్దము ఏర్పడియుండవచ్చును. 8) ఈ శ్లోకమున సమాసపదములు, భిన్నార్థములుగల ఒక పాదము సమానార్థములుగల ఒక పాదము కలదు.

**అవతారిక:-** అథ రామకృష్ణాభ్యాం యాం మాయాం అవష్టభ్య సాకారతా స్వీకృతా తస్యాః స్వరూపం సమాక్షరయా రథోద్ధతయా ఆహ.

**శ్లో॥** **తామసీత్యసతి సత్యసీమతా**
మాయయా క్షమ సమక్షయా యమా।

మాయయాక్షమ సమక్షయాయమా
తామసీత్యసతి సత్య సీమతా॥ 3

అవతారిక:- రామకృష్ణులు ఏమాయతో దేహములను స్వీకరించిరో ఆమాయా స్వరూపమును 'రథోద్ధతా' వృత్తముతో కవి వర్ణించుచున్నాడు.

రామపక్షమున, కృష్ణపక్షమున 'మాయ' ఒక్కటే కనుక ఈ శ్లోకమునకు '2' పాదములకు ఒకే అర్థము.

ప్రతిపదార్థము:- అసతి=అసత్యమయిన ప్రపంచమునందు, సత్యసీమతా=సత్య మయినది అను మర్యాదయే, తామసీ=అజ్ఞానజనితమయినది. అదే మాయ, అక్షమ సమక్షయా=బ్రహ్మ సమక్షమున నిలువజాలని, యయా=ఏమాయచేత, మా=లక్ష్మీదేవి, అయమా=నియమరహితురాలయినదో అదే మాయ. (రెండవ పాదమునకు ఇదే అర్థము కృష్ణ పక్షమున చెప్పవలెను)

భావము:- ముత్యపుచిప్పయందు (శుక్తి) రజత (వెండి) భ్రాంతి కలిగినట్లు వాస్తవ బ్రహ్మమునందు ప్రపంచభ్రాంతి అజ్ఞానమువలన కలుగుచున్నది. ఈ భ్రాంతియే మాయ. ఈ భ్రాంతి ఎంత అసత్యమో కార్యవశమున తెలియు చున్నది. బ్రహ్మజ్ఞానికి బ్రహ్మాకార చిత్తవృత్తిలో 'బ్రహ్మాహం' భావన కల్గిన సమయమున ఈ 'మాయ' నిలువదు. లేని సమయమున నిలుచును. కనుక ఈమె అక్షమ సమక్ష. ఈ మాయవలన లక్ష్మియు చంచలురాలయినది. మాయా జన్యపాపపుణ్యాది కర్తృత్వ భోక్తృత్వముల వలన జీవునకు స్థిరముగానుండవలసిన 'ఆత్మశక్తి' అయిన లక్ష్మి లేదా భౌతికసంపద చంచలము అయినది. జీవబుద్ధి చంచలమయినదని మఱొక అర్థము.

పైగా మాయాస్వరూపము విచారణలో మిథ్య అని తేలును కనుక ఆప్రకారము గూడా 'అక్షమసమక్ష' యీమె. ఈ పద్యము '2' పాదములందు సమాక్షరములతో సమానార్థములతో గలదు.

అవతారిక:- ఏవమవిద్యాయాః స్వరూపం నిరూప్య ఇదానీం విద్యారూపం విషమాక్షరయా శాలిన్యా అహ

శ్లో॥ కా తాపఘ్నీ తారకాద్యా విపాపా
త్రేధా విద్యా నోష్ణకృత్యం నివాసే।

సేవా నిత్యం కృష్ణ నోద్యా విధాత్రే
పాపావిద్యా కారతాఘ్నీ పతాకా॥ 4

**అవతారిక:-** అవిద్యయొక్క స్వరూపస్వభావ ప్రభావములను ఉగ్గడించి యీ శ్లోకమున 'విద్యా' ప్రాభవమును వర్ణించుచున్నాడు. ఇందు '2' పాదములందు అక్షరములు విషమములు. ఇది శాలినీవృత్తము.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) తాపఘ్నీ=తాపములను, అజ్ఞానమును పోగొట్టునది, కా=ఏది? అని ప్రశ్నింపగా, త్రేధా=ఋగ్యజుస్సామవేదములని మూడు విధములయిన, విపాపా=పాప లేదా అజ్ఞానరహితమయినదియు, తారకాద్యా=తారకమయిన రామరూపపరబ్రహ్మను నిరూపించుట మొదలుగా గల, విద్యా=ఉపనిషద్విద్య పాపహరవిద్య అగును, నివాసే=గృహమునందు, ఉష్ణకృత్యమ్=సంతాపము, న=లేదుగదా!

**భావము:-** తారకమయిన బ్రహ్మ పదార్థమును గూర్చి చెప్పు త్రివిధ వేదశిఖ లయిన ఉపనిషత్తులు సంసారతాపమును పోగొట్టును. గృహమునందు సంతాపము ఉండదు కదా! అట్లే వేదాంత విద్యానిమగ్నులకు సంసార సంతాపము లేదు.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) విధాత్రే=బ్రహ్మకు భాగవతమున, కృష్ణ= కృష్ణునిచే, నోద్యా=చెప్ప బడిన, నిత్యం సేవా=నిత్యసేవారూపమయిన అనన్యభక్తి, పాప=పాపముయొక్క అవిద్యాకార=అవిద్యారూపమయిన అజ్ఞానముయొక్క తా=తత్త్వములను, ఘ్నీ= పోగొట్టును, పతాకా=ఈ విద్య భగవంతుని 'పతాక' వంటిది.

**భావము:-** పై పాదములో రామపక్షమున చెప్పిన 'విద్య'కు తోడుగా భాగవతాది గ్రంథములందు కృష్ణుడు చెప్పిన 'నిత్యసేవ' లేదా 'అనన్య భక్తి' తోడు అయినచో, అజ్ఞాననాశము చేయును. విద్య భగవంతుని పతాకవలె సర్వఅవిద్యానాశనము చేయును. గరుడధ్వజము చూచినంతనే కృష్ణసాక్షాత్కారము జరిగినట్లు 'విద్య' అనబడు బ్రహ్మాకార చిత్తవృత్తి బ్రహ్మ సాక్షాత్కారమును కలిగించును.

**విశేషములు:-** 1) జ్ఞానమునకు అనన్యభక్తి సహకరించినచో సగుణ దర్శనముతో నిర్గుణభావన గూడా ఏర్పడి బ్రహ్మజ్ఞానముకలుగునని కవి ఆశయము. 2)

'విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయం సహ' అని కర్మకాండరూప-అవిద్యా భాగమునువదలి బ్రహ్మకాండ రూపమయిన వేదాంత భాగము 'విద్యా' రూప మని, 'తారకాద్యా' అనుపదముచే చెప్పబడెను. 3) 'గృహమునందు సంతాపము లేదు' అని అర్థాంతరన్యాసము చెప్పబడినది. 4) వేదాంతమే జీవునకు 'గృహము' అని యిచ్చట రూపకాలంకార ధ్వని. అదే నిజతత్త్వమని వస్తుధ్వని. 5) 'భక్త్యా త్వనన్యయా శక్యః అహమేవం విధోఽర్జున, జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప' అను గీతావాక్యము అనన్యభక్తిని ఉపదేశించినది కనుక 'కృష్ణనోద్యా' అని కవి ప్రయోగము. 6) ఈ శ్లోకమున 2 పాదములందు అక్షరములు తలక్రిందులయినవి కనుక ఇది విషమాక్షరము.

అవతారిక:- అథ ప్రథమం 'మాయా' పరమాత్మనః సమక్షం స్థాతుం శక్నోతి- ఇతి స్వరూపానుసంధానేన మాయాయాః తిరస్కార ఇతి ఉక్తమ్. తత్ర ఆత్మ జ్ఞానే మహానాయాసః. శ్రీరామసేవయాతు విద్యాప్రాప్తిః, తయా తత్కాలమేవ అజ్ఞాన నిరాసః ఇతి విషమాక్షరయా ఇంద్రవజ్రయాహ.

శ్లో॥ శ్రీరామతో మధ్యమతోది యేన
ధీరోఽనిశం వశ్యవతీ వరాద్వా।
ద్వారావతీవశ్యవశం నిరోధీ
నయేదితో మధ్యమతోఽమరాశ్రీః॥ 5

అవతారిక:- 'పరమాత్మ సమక్షమున మాయ నిలువదు' అని, స్వరూపమును తెలిసికొన్న తరువాత మాయ, తొలగునని కవి చెప్పెను. అయితే 'ఆత్మజ్ఞానము' చాల కష్టము. శ్రీరామసేవతో 'విద్య' సులభముగా లభించును. ఈ 'విద్య' వలన తక్షణమే అజ్ఞానము తొలగును. అని కవి చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:-(రామపక్షమున)యేన=ఏ పురుషునిచేత, వశ్య=వశముచేసికొను రూపము, వతీ=కల త్రిపురసుందరి అయిన సీతాదేవికి, వరాత్=భర్త అయిన, శ్రీరామతః=శ్రీరామునివలన, అనిశం=నిత్యము, మధ్యమ్=వ్యక్తమధ్యమయిన ప్రపంచము లేదా మధ్యలోకమయిన భూలోకము, అతోది=నశింపజేయ బడినదో అతడు, ధీరః=ధీరుడు, వా=కదా.

భావము:- త్రిభువన సుందరి అయిన సీతాసతి వరించిన జగన్మోహనుడయిన శ్రీరాముని ఉపాసించి ఆయన దయ ద్వారా ఈ 'మధ్య' లో వ్యక్తమయిన 'మధ్యమ' లోకమును విడిచిన పురుషుడే ధీరుడు.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) నిరోధీ=ఇంద్రియనిరోధముకల పురుషుడు, మధ్యమ్=జ్ఞాన-అజ్ఞాన గ్రంథి స్వరూపము అయిన మనసును, ఇతః=ఈ ప్రపంచమునుండి, ద్వారావతీ=ద్వారకకు, వశ్య=స్వాధీనుడైన కృష్ణునకు, వశమ్= వశమును(నకు), నయేత్=చేర్చవలయును, అతః=ఇట్లు కృష్ణునకు వశము చేయుటవలన, అమరా =అమృతరూపమయిన, శ్రీః=మోక్ష సంపద లభించును.

**భావము:-** జితేంద్రియుడు మనోనిగ్రహముకల ధీరుడు తన జ్ఞానాజ్ఞాన సమ్మేళన రూపము అయిన మనస్సును, అజ్ఞాన రూపమయిన ప్రపంచము నుండి జ్ఞాన రూపుడయిన ద్వారకావాసునకు వశముచేసినచో అట్టివానికి మోక్షసంపదయగు శాశ్వత ఐశ్వర్యము లభించును. లేనిచో ఇంద్రియనిగ్రహము ఉన్నను కృష్ణభక్తి, కృష్ణకృప లేనిచో విఘ్నములు కలుగును.

**'తథా న తే మాధవ తావకాః క్వచిత్ భ్రశ్యంతి మార్గాత్'** అని 'కవి' ఒక ప్రమాణమును ఇచ్చినాడు. మఱియు **'న మే భక్తః ప్రణశ్యతి, యోగక్షేమం వహామ్యహమ్'** అను గీతావచనములనుబట్టి గూడ 'భక్తి' వలన భగవంతుని సహాయము లభించునని తెలియును.

**అవతారిక:-** అథ కథాప్రారంభః-తత్ర విశ్వామిత్రః స్వయజ్ఞసంరక్షణార్థం రామం యాచితుం దశరథం ప్రత్యగాదితి విషమాక్షరయా రథోద్ధతయాహ.

శ్లో॥ కౌశికే త్రితపసి క్షరవ్రతీ యో దదాత్ ద్వితనయస్వమాతురమ్।
రంతు మాస్వయన తద్విదాదయోఽతీవ్రరక్షసి పతత్రి కేశికౌ॥ 6

**అవతారిక:-** విశ్వామిత్రుడు యజ్ఞరక్షణకు దరశథుని సమీపించుట, దశరథుడు రామలక్ష్మణులను పంపుట; పూతన కృష్ణుని వలన చచ్చుట, బకాసురకేశి రాక్షసుల వధ ఇందులో వర్ణింపబడినవి.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) యః=ఎవడు, క్షర=(నశించు) భూతము లందు, వ్రతీ=తృప్తిని కలిగించువ్రతముగలవాడో ఆ దశరథుడు, త్రితపసి= త్రిగుణాత్మకమయిన, కౌశికే=విశ్వామిత్రునియందు, ఆతురమ్=వ్యాకులమయిన (పితృవిరహంతో) ద్వితనయ=ఇద్దఱుకొడుకులు అనే, స్వమ్=ధనమును, అదదాత్ =ఇచ్చెను.

**భావము:-** భూతదయాపరుడగు దశరథుడు తన, కుమారులయిన రామలక్ష్మణు లను మహాతపస్వి అయిన విశ్వామిత్రునకు ఇచ్చెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) ఆస్వయన=పరమార్థగతిగల ఓ పరీక్షిత్తు మహారాజా!, తద్విత్= వారిని బాగుగా తెలిసిన కృష్ణుడు, అతీవ్రరక్షసి=అతి తీవ్ర రాక్షసి అయిన పూతన యందు, పతత్రి=పక్షిరూపుడయిన బకాసురుని యొక్క కేశి=అశ్వరూపుడయిన 'కేశి' రాక్షసునియొక్క కౌ=పార్థివ శరీరమునందు, రంతుమ్=ఆడుకొనుటకు, ఆదయః=గొప్ప దయగలవాడయ్యెను.

భావము:- ఓ పరీక్షన్మహారాజా! పూతన, బకాసురుడు, కేశి అను రాక్షసుల తత్త్వము తెలిసిన శ్రీకృష్ణుడు వారి శరీరములతో ఆడుకొనుటకు దయచూపెను.

విశేషములు:- 1) విశ్వామిత్రుడు 'త్రితపస్సు' గలవాడు అనెను. సత్త్వరజస్తమస్సులుగల తపస్సు సత్త్వరజస్సును, లేదా 'సృష్టిస్థితిలయలు' చేయగల తపస్సు గలవాడని అర్థము. అపరబ్రహ్మ అనిభావము. 2) ఆతురం= పితృ విరహముచే దిగులుపడుచున్న అని కవివ్రాసిన వ్యాఖ్య. కాని వాస్తవముగా ఆతురుడైనది దశరథుడే. కనుక 'ఆతురం' అనునది క్రియా విశేషణముగా చెప్పినచో బాగుండును. 3) 'ఆస్వయన' ఆ=పూర్తిగా సు=మంచి, అయన= మార్గము కలవాడు అని పరీక్షిత్తుకు సంబోధన. ఇది క్లిష్టమే. కాని చిత్ర కావ్యములలో ఇట్టివి తప్పవు. 4) 'అతీవ్రరక్షః' అనగా, దేనికన్న తీవ్రమయిన రాక్షసి లేదో అది అని పంచమీ బహువ్రీహి చేయవలయును. 5) కౌ=శరీరము నందు. అనగా వారి శరీరములతో భగవంతుడు ఆడుకొనుట అనగా ఇదంతయు భగవంతుని క్రీడ అనియు, ఆత్మ భగవంతుని రూపమే కనుక క్రీడ శరీరములతో అనియు తెలియుచున్నది. 'యథార్భకః స్వప్రతిబింబ విభ్రమైః' - భాగవతం10స్క. 6) కుః=అనగా మట్టి లేదా భూమి. దీనిమీద లక్షణా వృత్తితో'శరీరము' మట్టితో తయారయిన శరీరము అని అర్థము చెప్పవలయును. ఇది చిత్రకావ్య లక్షణము.

అవతారిక:- అథ విశ్వామిత్రేణ సహ రామం ప్రస్థితం ఆకర్ణ్య రాక్షసాః తాటకాం ప్రేషయామాసుః ఇత్యాహ.

శ్లో॥ లంబాధరోరు త్రయలంబనాసే
త్వం యాహి యాహి క్షరమాగతా జ్ఞా।
జ్ఞాతాగమా రక్ష హి యాహి యాత్వం
సేనా బలం యత్ర రురోధ బాలమ్॥ 7

అవతారిక:- విశ్వామిత్రునితో కలిసి రాముడు బయలుదేటిన సంగతి విని

రాక్షసులు తాటకను పంపిరి. గోకులమున కృష్ణుడు ఉన్న విధమును తెలిసికొని కంసుడు పూతనను పంపెను. ఈ విషయములను కవి ఈ పద్యమున చెప్పు చున్నాడు.

ప్రతిపదార్థము:-(రామపక్షమున) లంబ=వ్రేలాడుచున్న, అధర=పెదవులు, ఊరు =తొడలుగల దానా, త్రయ=లోకత్రయమునందు, లంబ=వ్రేలాడు, నాసే=ముక్కు గలదానా? తాటకా!, త్వమ్=నీవు, ఆగత=వచ్చిన, ఆజ్ఞా=రావణాజ్ఞగలదానవు, క్షరమ్=మర్త్యు డయిన రాముని గూర్చి, యాహియాహి=పొమ్ము, పొమ్ము.

భావము:- వ్రేలాడుచున్న ముక్కులు, తొడలు, పెదవులుగల వికృతరూపిణి అయిన ఓ తాటకా! నీకు రావణాజ్ఞ అయినది. మరణ శీలుడయిన ఆ మానవుని మీదకు పొమ్ము అని రాక్షసులు తాటకను ఆజ్ఞాపించిరి.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) సేనా=నందునితో గూడిన యశోద, యత్ర= ఎచ్చట, బాలమ్= బాలకృష్ణుని, రురోధ=అట్టిపెట్టెనో అచ్చటకు, త్వమ్=నీవు (పూతనా!), యాహి= వెళ్ళుము, బలమ్=మన బలమును పురుషార్థమును, రక్ష= రక్షించు, యాత్వమ్= ఏ నీవు, జ్ఞాతాగమా హి=అవతార పురుషునిరాక తెలిసిన దానవు గదా!

భావము:- పూతనా! భర్తఅయిన నందునితో సహా యశోద గోకులమున బాల కృష్ణుని దాచి ఉంచినది. నీవు వెళ్ళి అచ్చట మన బలమును రక్షింపుము. నీవు అవతార పురుషుని ఆగమనమును ఎఱిగిన దానివి కదా! నీవు ఈ పని చేయ గలవు అని కంసుడు పూతనను ప్రార్థించెను.

విశేషములు:- పూర్వశ్లోకమున పూతనా వధను చెప్పిన కవి యీ శ్లోకమున జరిగిన వృత్తాంతముగా పూతనావృత్తాంతమును చెప్పుచుండెను. తరువాత శ్లోకమందును పూతనసంగతియే కృష్ణుని పక్షమున చెప్పబడెను.

అవతారిక:- అథ తాటకయా సహ శూర్పణఖాపి సమాగతేత్యాహ.

శ్లో॥ లంకాయనా నిత్యగమా ధవాశా
సాకం తయానున్నయమానుకారా।
రాకానుమా యన్నను యాతకంసా
శావాధమాగత్య నినాయ కాలమ్॥ 8

**అవతారిక:-** తాటకతో శూర్పణఖ వచ్చిన సంగతిని; గోకులమున పూతన వచ్చిన సంగతిని కవి యీ శ్లోకమున చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) అనున్న=ప్రేరేపింపబడక స్వయముగా వచ్చిన, యమ=యమునితో, అనుకారా=సాదృశ్యముగలదియు, లంకాయనా=లంకా నివాసము గలదియు అగు శూర్పణఖ, ధవాశా=భర్తయందు ఆశగలదయి, తయా సాకమ్=తాటకతో కలిసి, నిత్యగమా=సహచరురాలయ్యెను.

**భావము:-**లంకానివాసిని అయిన శూర్పణఖ స్వయముగా వెంబడిపడిన యమ ధర్మరాజు వంటిది. ఆ రాక్షసి భర్తలు గావలయునను ఆశతో తాటక వెంబడి నిత్యము తిరుగుచుండును. అందువలన తాటకతోబాటుగా శూర్పణఖ గూడా వచ్చెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) శావ=శవప్రియులయిన పిశాచశక్తులలో, అధమా=అధమురాలయిన పూతన, యత్=ఏకారణముచేత, రాకానుమా= పూర్ణిమతో పోలిన సౌందర్యముగలదో అందువలన, ఆగత్య=నివారణలేకుండా గోకులమున నంద గృహమున ప్రవేశించి, కాలమ్=యమునివంటి నల్లని బాలకృష్ణుని, నినాయ= చేరుకొనెను, (సా=అది), యాత=లేకుండాపోయిన, కంసా=కంసుడు కలదైనది (అనగా తను చచ్చుటవలన కంసునితో సంబంధము లేనిదై) నను=కదా!

**భావము:-** పిశాచశక్తి అయిన పూతన 'పూర్ణిమ' వలె సుందర రూపముతో గోకులమున ప్రవేశించినది. అందువలన ఎట్టి అభ్యంతరములు లేకుండగ నందుని యింట చేరి బాలకృష్ణుని పొంది చావును / ముక్తిని సంపాదించినది. అందువలన మఱల కంసుని చూడవలసిన అవసరము లేకపోయినది.

**విశేషములు:-** 1) తాటకతో పాటు శూర్పణఖ వచ్చుట కవి కల్పన. రావణుని ఆజ్ఞతో తాటక కదలిన దనుటయు కవి కల్పనయే. 2) రామాయణ వృత్తాంతము లన్నియు ముందుగానే రావణునకు తెలిసినట్లుగా కవి ఊహ. దీనినిబట్టి కవికి ఆశ్చర్య రామాయణము మున్నగు వివిధ రామాయణములతో పరిచయము కలదని తేలుచున్నది.

**అవతారిక:-** అథ విశ్వామిత్రస్య యాగవ్యవస్థాం అనుష్టుభా ఆహ.

శ్లో॥ 'గాధిజాధ్వరవైరా యే తే౽తీతా రక్షసా మతాః।
తామసాక్షరతాతీతే యే రావై రధ్వజాధిగాః॥ 9

అవతారిక:- విశ్వామిత్రుని యాగ పరిస్థితిని; పూతన తర్వాత, కంసుడు పంపిన రాక్షసుల మానసిక స్థితిని వర్ణించుచున్నాడు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) రక్షసా=రావణునిచేత, మతాః=గౌరవింప బడిన, గాధిజ=విశ్వామిత్రుని, అధ్వర=యజ్ఞమునందు, వైరాః=విరోధముగల, యే=ఏరాక్షసులు గలరో, తే=ఆ రాక్షసులు, అతీతాః=గడచిపోయిరి. ప్రపంచము ను వదలిపోయిరి.

భావము:- రావణ గౌరవపాత్రులయిన మారీచ సుబాహు ప్రభృతి రాక్షసులు విశ్వామిత్ర యజ్ఞవైరముతో రామ పరాక్రమమున నశించిరి.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) తామస=అజ్ఞాన జనితమయిన అహంకారము చేత, ఆ=పూర్తిగా ఉన్న, క్షరతా=నశ్యమయిన ప్రపంచధర్మములకు, అతీతే= మించిన బ్రహ్మస్వరూపు డైన కృష్ణునియందు, యే=ఏ రాక్షసులు, రావైః=కంసుని అఱుపులుచే ప్రేరేపింపబడిరో వారు, అధ్వజ=మార్గమునందు పుట్టిన, ఆధి= మానసవ్యధను, గాః= పొందినవారయిరి.

భావము:- 'పూతన' చనిపోయిన తర్వాత కంసుడు పెద్దగా అఱచుచూ పంపిన అనేకమంది రాక్షసులు పరబ్రహ్మరూపుడైన కృష్ణుని పైకి పోవుచు మార్గ మధ్యమున దిగులు పడసాగిరి. పూతనవలె చావవలసివచ్చునని వారి భావన.

విశేషములు:- 1) తామసాహంకార దూరమయిన బ్రహ్మతత్త్వము ముందఱ తామస రూపులయిన రాక్షసులు నిలువజాలరు. అని భావము. జ్ఞానము ముందఱ అజ్ఞానము నిలువదు అని భావము. 2) వ్యాఖ్యలో 'కవి' విశ్వామిత్ర యాగ వైరులు 'ఖరదూషణాదులు' అని వ్రాసెను. కాని మారీచ సుబాహువులు అని సర్దుబాటు చేయవలయును. 3) ఇది 'అనుష్టుప్' శ్లోకము.

అ:- అథ మునిభిః కేవలం రామార్పణబుద్ధ్యా కృతస్య యాగస్య ప్రశంసామాహ.

శ్లో॥ తావదేవ దయా దేవే
యాగే యావదవాసనా।
నాసవాదవయా గేయా
వేదే యాదవ దేవతా॥ 10

అవతారిక:- రామార్పణబుద్ధితో విశ్వామిత్రుడు చేసిన యాగమును మునులు ప్రశంసించిరి. అట్లే కృష్ణుని మహిమను తలచి రాక్షసులు భయపడిరి. ఈ విషయములు ఈశ్లోకమున వర్ణింపబడినవి.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) యాగే=యజ్ఞమునందు, అవాసనా= ఫలవాంఛారాహిత్యము, యావత్=ఎంత ఉండునో, తావదేవ=అంతయే, దేవే= దేవునియందు, దయా= ప్రీతిరూపమయిన 'దయ' ఉండును.

భావము:- ఫలవాంఛలేకుండగా పరమేశ్వరార్పణ బుద్ధితో చేసిన యజ్ఞమునందే పరమేశ్వరునకు ప్రీతి కలుగును.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) వేదే=వేదములందు ఉపనిషత్తులయందు, గేయా=గానము చేయదగిన, యాదవ=యాదవులయొక్క, దేవతా='దేవత' అయిన 'కృష్ణుడు', అవ=అవలక్షణమయిన, యా=ఏది, ఆసవాత్=ప్రాణాత్మక మయినదేహమువలన, న=నిరూపింపరానిది, లేదా, ఆసవాత్=మదము, అహంకారము మొదలైనవాని వలన, అవయా=తెలిసికొనదగినది, న=కాదు.

భావము:- వేదమాత్రవేద్యుడయిన యీ యాదవదేవుడు ప్రాణాత్మకమయిన దేహమునకు తెలియదు. అహంకారము, మదము మొదలగువానికి అందువాడు కాడు. కనుక మనకు ఎట్లు ఆయన సాధ్యుడగును అని రాక్షసులు భావించిరి.

విశేషములు:- 1) అవయా - అవయాయతే ఇతి అవయా 'ఆతోఽనుపసర్గే కః' ఇతి కః పశ్చాత్ టాప్,అవపూర్వకః యాతిః ఏతిః చ జ్ఞానార్థః అని కవివ్రాసిన వ్యాఖ్య. దీని తాత్పర్యము ఏమనగా, 'అవ' అను ఉపసర్గ పూర్వకమయిన యా ధాతువుకు 'తెలిసికొను' అని అర్థము. దీనికి కర్మార్థమున 'క' ప్రత్యయము చేసినచో 'తెలిసికొనదగిన' అని అర్థమువచ్చును. ఇచ్చట పైన వ్రాసిన సూత్రము కుదరదు. 'ఆతశ్చోపసర్గే' అను సూత్రముతో 'క' ప్రత్యయము వచ్చును.

అవతారిక:- అథ స్వయంవర దర్శనార్థం కౌశికేన సహ జనకగృహం ప్రతిగతో రామః తత్ర కింకృతవాన్ - ఇతి ఆహ.

శ్లో॥ సభాస్వయే భగ్నమనేన చాపం
కీనాశతానద్ధరుషా శిలాశైః।
శైలాశిషా రుద్ధనతాశనాకీ
పంచాననే మగ్న భయే స్వభాసః॥ 11

**అవతారిక:-** స్వయంవర దర్శనమునకు విశ్వామిత్రునితో కలిసి జనకుని యింటికి వెళ్ళిన రాముని వృత్తాంతమును; గోవర్ధనోద్ధరణ సందర్భమున ఇంద్రుని పరిస్థితిని వర్ణించుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) కీనాశతా=యమత్వముచేత, అనద్ధ=కూడిన రావణుని యొక్క, రుషా=రోషముగలవాడయిన, అనేన=ఈ రామునిచేత, శిలా=రాయివంటిగట్టి, ఆశైః=సీతాభిలాషగలరాజులతోసహా, సభాసు=సభల యందు, చాపమ్=శివ ధనుస్సు, భగ్నమ్=విఱవబడినది, అయే!=ఆశ్చర్యము.

**భావము:-**యమధర్మరాజువంటి రావణుడు ఒకనాడు శివధనుస్సును ఎత్తబోయి దాని క్రిందబడెను. కాని చావలేదు. అట్టి దుర్మార్గుని చంపక వదలినందుకు కోపము వచ్చినదన్నట్లుగా రాముడు స్వయంవరమునకు వచ్చిన ఇతరరాజుల ఆశలతో బాటుగా శివధనుస్సును ఆ మహాసభలో త్రుంచివేసెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణుని పక్షమున) పంచాననే=నరసింహరూపుడైన కృష్ణుడు, స్వభాసః=తన ప్రతాపమువలన, మగ్న=లేకుండగపోయిన, భయే=భయము కలవాడై యాగము చేయించుచుండగా, శైల=పర్వతమయిన గోవర్ధనముయొక్క ఆశిషా=కోరిక తీర్చుటచేత, రుద్ధ=అడ్డగింపబడినది కనుకనే, నత=భగ్నమయిన, అశ=హవిస్సు పై ఆశగల, నాకీ=స్వర్గాధిపుడు, (దృష్టః=చూడబడెను).

**భావము:-** బాలకృష్ణుడు నరసింహస్వామివలె నిర్భయముగా విజృంభింపగా పర్వత యాగమును రక్షించి ఆ పర్వతవాంఛను పూరింపగా దేవేంద్రుడు తన హవిర్భాగవాంఛను వదలుకొని అవమానముపొందెను.

**విశేషములు:-** 1) కీనాశతానద్ధరుషా - అనుచోట లక్షణ, వ్యంజనలతో అర్థము చెప్పవలసియున్నది. 2) శిలా అనుచోట గూడా అదే పరిస్థితి. 3) పంచాననే వద్ద లక్షణావృత్తి. 4) రావణాసురుని యందలి రోషముతో-ఇది సంబంధాతిశ యోక్తి. దీనిద్వారా 'రోషము' కలదని ఉత్ప్రేక్ష వ్యంగ్యము. 5) రాజుల ఆశలతో సహా ధనుస్సును విరుచుట అను వాక్యము 'సహోక్తి' అలంకారము. 6) 'సహ' అనునది, 'దృష్టః' అనునది అధ్యాహారము. 7) రావణాసురుడు శివధనుస్సు క్రింద బడుట అనునది వాల్మీకము కాదు. ఇది రామాయణసారోద్ధార, ఆశ్చర్య రామాయణము మొదలగు ఉపరామాయణములలోని చిత్రకథ.

**అవతారిక:-** అథ స్వయంవరార్థమాగతానాం రాజ్ఞాం వర్ణయన్ ఆహ.

శ్లో॥ న వేద యామక్షర భామసీతాం
కా తారకా విష్ణుజితేఽవివాదే।
దేవావితే జిష్ణు వికారతా కా
తాం సీమభారక్షమయాదవేన॥ 12

అవతారిక:- స్వయంవరమునకు వచ్చిన రాజుల మాటలను; గోవర్ధనోధరణము నందు ఇంద్రుని ఆటలు సాగలేదనియు ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) లోకః=లోకము, యామ్=ఏ, అక్షర=అమృత మయిన, భామ= కాంతిగల / సౌభాగ్యముగల, సీతాం=సీతను, నవేద= ఎఱుగదో ఆ సీత యామె, విష్ణుజితే=విష్ణుజయము, అవివాదే=నిర్వివాదమయి యుండగా, తారకా=రామచంద్రుని పొందవలసిన నక్షత్రము, కా=సీతకాక మఱెవరు?

భావము:- సీతాదేవి అమృతస్వరూపిణి అయిన భువనసుందరి అని లోక మెఱుగదు. విష్ణువయిన రామచంద్రుడు ధనుస్సును విఱిచి గెలిచిన సంగతి నిర్వివాదము. ఈ రామ 'చంద్రుని' పొందదగిన 'తారక' అనగా నక్షత్రము ఆమెయే గదా! అని రాజుల వ్యాఖ్య.

ప్రతిపదార్థము:- (కృష్ణ పక్షమున) సీమ=పర్వత పరిధియొక్క, భార=మోయుట యందు, క్షమ= సమర్థుడయిన, యాదవేన=యదువంశీయుడైన కృష్ణునిచేత, దేవ=దేవశక్తిచే, అవితే=రక్షింపబడిన గోకులమునందు, జిష్ణు=ఇంద్రునియొక్క వికారతా=రాళ్ళు గురియుట వంటి కోప వికారము, కా=ఎట్టిది, తామ్=దానిని గూర్చి, (ధిక్= తిరస్కారము).

భావము:- గోవర్ధనోద్ధరణము చేసిన యాదవుడు తన దివ్యశక్తితో గోకులమును రక్షించెను. ఇక ఇంద్రుని కోపము, దానివలన రాళ్ళు వానగా కురియుట వంటివి ఏమి లెక్క. అని కవి వ్యాఖ్య.

విశేషములు:- 1) ఈ శ్లోకములో అధ్యాహారములు, లక్షణావ్యంజనలు బాగా అవసరమయినవి. 2) సీతను నక్షత్రముగా చెప్పుటవలన రూపకాలంకారము. రామునియందు 'చంద్రత్వము' వ్యంగ్యరూపకాలంకారము. అనురూపదాంపత్యము వ్యంగ్యమగుటవలన సమాలంకార' ధ్వని. 3) శ్లోకమున కృష్ణపక్షమున 'తాం'

అనునది ఉన్నది. దానికి వ్యాఖ్యానములో కవి అర్థము వ్రాయలేదు. అందువలన తాం అనుదానికి 'ధిక్' అను అధ్యాహారముతో నేను అర్థము కల్పించితిని.

అవతారిక:- అథ ధనుషి భగ్నే సతి జానక్యా రామో వృత ఇత్యాహ.

శ్లో॥ తీవ్రగోరన్వయత్రార్యో
వైదేహీ మనసో మతః।
తమసో న మహీదేవై
ర్యోఽత్రాయ న్వరగోవ్రతీ॥ 13

అవతారిక:- ధనుర్భంగము తరువాత రాముని సీత వరించినది అని, బ్రాహ్మణ యజ్ఞము వద్దకు వెళ్ళిన కృష్ణుని బ్రాహ్మణులు తిరస్కరించిరనియు ఈ శ్లోకమున చెప్పబడినది.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) తీవ్రగోః=తీవ్రకిరణుడయిన సూర్యునియొక్క అన్వయ=వంశమునకు, త్ర=రక్షకులయిన దిలీపాదులలో, ఆర్యః=శ్రేష్ఠుడయిన రాముడు, వైదేహీ= సీతయొక్క, మనసః=మనస్సునకు, మతః=ఇష్టుడయ్యెను.

భావము:- సూర్యవంశరత్నము అయిన రాముని విదేహవంశమణి అయిన సీత వరించెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) అత్ర=బ్రాహ్మణయాగమునందు, ఆయన్= వచ్చునట్టి, వర=గొప్ప, గో=అవులే, వ్రతీ=వ్రతముగాగలవాడు, యః=ఎవడో ఆ గోపాలకృష్ణుడు, తమసః=అజ్ఞానమువలన, మహీదేవైః=బ్రాహ్మణులచేత, న=గౌరవింపబడలేదు.

భావము:- బ్రాహ్మణ యజ్ఞమండపమునకు వెళ్ళిన శ్రీకృష్ణుని 'పరబ్రహ్మత్వము' తెలియని బ్రాహ్మణులు ఆయనను తిరస్కరించిరి.

అవతారిక:- అథ జానక్యాః పారమార్థికం స్వరూపమ్ వర్ణయన్ ఆహ,

శ్లో॥ వేద యా పద్మసదనం
సాధారావతతార మా।
మారతా తవ రాధా సా
నంద సద్మప యాదవే॥ 14

అవతారిక:- సీతాదేవియొక్క పరమార్థతత్త్వమును కవి, రాధాకృష్ణ సమాగమము గూర్చి నందునితో గోపికలు; చెప్పుట ఈ శ్లోకమునందు వర్ణింపబడినది.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) యా=ఏదేవత, పద్మ=పద్మముఅనే, సదనమ్= నివాసమును, వేద=తెలిసియుండెనో, (సా=ఆ), మా=లక్ష్మి, సాధారా=ఆధార మయిన విష్ణువుతో కలిసినదై, అవతతార=అవతరించెను.

భావము:- పద్మాలయ అయిన లక్ష్మీదేవియే తనకాధారమయిన విష్ణువుతో సహా 'సీత' గా అవతరించెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) సద్మప=గృహేశ్వర!, నంద=నందరాజా!, తవ= నీయొక్క, సా=ఆ, రాధా=రాధాదేవి, యాదవే=కృష్ణునియందు, మారతా= మన్మథత్వము(ను) చూచుచున్నది.

భావము:- గృహయజమానీ! నందా! నీ రాధ శ్రీకృష్ణునియందు మన్మథావేశము కలదయ్యెను. అని సమాచారము కలదు.

విశేషములు:-1) పద్మసదనం - అన్నచోట కవి తన వ్యాఖ్యలో '2' అర్థములను చెప్పెను. (1) తనకునివాసమయిన పద్మమును, (2) విష్ణుచరణ కమలమును, కాని యీ రెండు అర్థములకన్న 'బ్రహ్మను, లేదా విష్ణునాభిని - సృష్టికి పూర్వమే ఎఱిగినది అని చెప్పినచో 'అనపాయిని' అయిన మహాలక్ష్మి అని అర్థము వచ్చును. 2) లక్ష్మి విష్ణువక్షస్థలమునందు నివసించును కనుక 'సాధారా' అనగా విష్ణువుతో కలిసి అవతరించినదని అర్థము సంగతము. 3) తవ-రాధా నందునితో నీ యొక్క 'రాధ' అనుటకన్న తవ-యాదవే. నీ కృష్ణునియందు అన్నచో బాగుండును. కాని కవి వ్యాఖ్య అది. 4) రాధాప్రేమ వలన కృష్ణుని వయస్సు తెలియుచున్నదని కవివ్యాఖ్య. కాని ఏ పురాణమును బట్టి అయిన ఉపనయన విద్యాభ్యాసములకు ముందే వ్రజనివాసము కనుక కృష్ణుని వయస్సు బాల్య మనియే చెప్పవలయును.

అవతారిక:- అథ ఈశ్వరస్య ధనుర్భంగమాకర్ణ్య పరశురామః అభ్యగాదిత్యాహ.

శ్లో॥ శైవతో హననేఽరోధీ
యో దేవేషు నృపోత్సవః।
వత్సపో నృషు వేదే యో
ధీరోఽనేన హతోఽవశైః॥ 15

అవతారిక:- ఈశ్వర కోదండ భంగము విని పరశురాముడు వచ్చుట; కృష్ణుడు ధేనుకుని చంపుట అను వృత్తాంతములు ఈ శ్లోకమున వర్ణింపబడినవి.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) నృప=దశరథునకు, ఉత్సవః=పండుగ అయిన వాడు, యః=ఎవడో ఆ రామచంద్రుడు, శైవతః=శివభక్తుడయిన పరశురాముని నుండి,హననే=చంపునంతకోపమునందున్ను, దేవేషు=దేవతలుచూచుచుండగా, అరోధీ=నిరాటంకముగా కనబడెను.

భావము:- దశరథోత్సవ రూపుడయిన రామచంద్రుడు శివభక్తుడయిన పరశు రాముని ఆగ్రహస్వరూపము ముందర నిర్భయముగా నిలిచెను. దేవతలు ఆశ్చర్యముగా చూచుచుండిరి.

ప్రతిపదార్థము:-(కృష్ణపక్షమున) యః=ఎవడు, వేదే=వేదమునందు ప్రతిపాదింప బడునో, వాడు, నృషు=మానవులలో, వత్సపః=దూడలను కాచువాడు, అయ్యెను, అనేన=అట్టి యీ కృష్ణునిచేత, ధీరః=ధైర్యశాలి అయిన ధేనుకాసురుడు, అవశైః =అసాధ్యులయిన సహచర రాక్షసులతో సహా, హతః=చంపబడెను.

భావము:-వేదవేద్యుడయిన భగవంతుడు గోకులమున దూడలుకాయుచుండెను. అట్టి శ్రీకృష్ణుడు ధేనుకాసురుని ఆతని పరివారమును సంహరించెను.

విశేషములు:- 1) నృపోత్సవః వద్ద కవి వ్యాఖ్య పంచమీబహుప్రీహిగా ఉండెను. అంత క్లిష్టత అనవసరము కనుక షష్ఠీతత్పురుషతో లక్షణతో నేను సమన్వయము చేసినాను. 2) 'హననం' వద్ద కార్యకారణ సంబంధముతో 'కోపము' అని లక్షణ. 3) దేవతలు 'సాక్షులయియుండగా' అని అధ్యాహారము చేయవలెను. 4) కృష్ణుని పక్షములో వేదవేద్యుడయిన భగవంతుడు దూడలనుకాయుట వలన స్వామి భక్తపరతంత్రత, కరుణ ధ్వనించుచున్నవి కనుక వస్తుధ్వని. 5) ఇచ్చట 'వత్స' శబ్దమునకు 'బిడ్డలు' అని అర్థముగూడా చెప్పినచో భగవంతుడు 'జగత్పిత' అని వస్తుధ్వని. 6) వత్సపాలకుడయినవాడు ధేనుకాసురుని చంపుట అనగా 'ఆవును' చంపుట విచిత్రము అని 'విషమాలంకారధ్వని'.

అవతారిక:- అథ పరశురామో రామం ప్రతి సక్రోధం వదతి.

శ్లో॥ నగోపగోఽసి క్షర మే పినాకేఽ
నాయోఽజనే ధర్మధనేన దానమ్।
నందాననే ధర్మధనే జయో నా
కేనాపి మే రక్షసి గోపగో నః॥ 16

**అవతారిక:-** పరశురాముడు రామునితో క్రోధముగా మాట్లాడుట; దైత్యవధ చూసి నందుడు కృష్ణుని స్తుతించుట - ఈ శ్లోకమున వర్ణింపబడినవి.

ప్రతిపదార్థము:-(రామపక్షమున) క్షర=ఓ నశ్వరుడా! (మర్త్యుడా!), మే=నాయొక్క పినాకే=ధనుస్సుముందఱ, నగోపగః=పాషాణమువలె చలనములేనివాడవై, అసి=ఉన్నావు, అజనే=దానపాత్రముకాని నీయందు, ధర్మధనేన=కన్యారూపమున ధర్మ ధనముతో, దానమ్=ఏ దానము జరిగినదో అది, అనాయః=నైతికము కాదు.

**భావము:-** ఓ మానవుడా! నా ధనుస్సు ముందఱ నీవు రాయివలె స్పందన లేకుండా నిలబడితివి. ఇట్టి నీకు జనకుడు చేసిన కన్యాదానము అపాత్రదానము. అని పరశురాముడు రాముని నిందించెను.

ప్రతిపదార్థము:-(కృష్ణపక్షమున)త్వమ్=కృష్ణా! నీవు, ధర్మధనే=ధర్మసంపదఅయిన, నంద=నందుడు, ఆననే=ముఖమువలె ముఖ్యుడుగా గల గోకులమున, నా=నరుడవు పురుషుడవు అయినావు, నః=మాకు, జయః=విజయస్వరూపుడవు అయితివి, కేనాపి=ఏదోపుణ్యముతో, గోపగః=గోపాలకులములోనివాడవై, మే=నాకు సంబంధించిన అన్నింటిని, రక్షసి=రక్షించుచున్నావు.

**భావము:-** కృష్ణా! నీవు ధర్మసంపద అయిన నా గోకులమున గొప్ప పురుషుడవు అయినావు. మాకు అన్నింట నీవు విజయముగా మాఱినావు. ఏదో పుణ్యము వలన నా గోకులమును రక్షించుచున్నావు. అని నందుడు కృష్ణుని ప్రశంసించెను.

**విశేషములు:-** 1) నగోపగః - నగస్య ఉప=సమీపే, గచ్ఛతి ఇతి=నగోపగః, అనగా రాయి అని అర్థము. 2) పినాకే - అనగా శివధనుస్సు. కాని యిచ్చట లక్షణా వృత్తితో 'ధనుస్సు' అని సామాన్యార్థము. 3) అజనః - జనః=వ్యక్తి. అజనః=వ్యక్తి కానివాడు. అనగా యోగ్యుడయిన వ్యక్తికాడు. 4) అనాయః - నయము అదే నాయము. స్వార్థములో 'అణ్' ప్రత్యయము. నయముకానిది అనాయము. నయము=నీతి, పద్ధతి. 5) నందాననే - ఆననం అనగా ముఖము. అనగా ముఖ్యము. అని లక్షణ. నందుడే ముఖ్యముగాగల గోకులము అని అర్థము. 6) మే-అనగా సంబంధార్థములో షష్ఠి. సంబంధించినవి అని లక్షణతో అర్థము చెప్పవలెను.

**అవతారిక:-** అథ రామం రాజ్యాధికారిణం దృష్ట్వా కైకేయీ సాపత్న్యభావం దర్శయతీత్యాహ.

శ్లో॥ తతాన దామ ప్రమదా పదాయ
నేమే రుచా మస్వనసుందరాక్షీ!
క్షీరాదసుం నస్వమచారు మేనే
యదాప దామ ప్రమదా నతాతః॥ 17

అవతారిక:- రామ పట్టాభిషేకమునకు 'కైక' అడ్డుచెప్పిన విషయము; కృష్ణుడు 'చల్లకుండ' పగులగొట్టినపుడు యశోద శ్రమపడిన విషయము ఈ శ్లోకములో వర్ణింపబడెను.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) ఆమస్వన=అపక్వమయిన మాటలుగలదియు, సుందర=అందమయిన, అక్షి=కన్నులుకలదియు, ప్రమదా=మదముగల కైక, ఇమే=రాముడు మొదలగువారు, రుచా=కాంతితో, పదాయ=సింహాసనము కొఱకు, న=తగరు అని, దామ=నిర్బంధపాశమును, తతాన=విస్తరించెను.

భావము:- సుందరనయన అయిన కైక మదముతో 'రామాదులు పట్టాభిషేకమునకు తగరని' పరిణతిలేని మాటను అడ్డువేసెను. దశరథుని వాక్యపాశముతో కట్టి వేసెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) ప్రమదా=యశోద, క్షీరాత్=పాలకన్న, అసుమ్=ప్రాణమునుగూడ,స్వమ్=తనదిగా, నమేనే=తలచలేదు,యత్=ఏ, దామ=త్రాటిని, అప=పొందినదో దానిని, అచారు=కట్టుటకు చాలనిదిగా, మేనే=తలచెను, అతః =ఇందువలన, నతా=వంగినది.

భావము:- బాలకృష్ణుడు పాలకుండ పగులకొట్టెను. యశోద పాలను తన ప్రాణము కన్న అధికముగా భావించి బాధపడెను. కృష్ణుని కట్టివేయుటకు త్రాడు తెచ్చెను. కాని ఆత్రాడు సరిపోలేదు. అందువలన ఆమె లొంగిపోయెను. అంటే శ్రమపడి వాలిపోయినది అని అర్థము.

విశేషములు:- రామాయణార్థములో కైకేయిని 'అపరిపక్వవచనురాలు' అనుట సాభిప్రాయము. పరిణత వాక్యములు కావు కనుకనే తన మాతృధర్మమునకు భార్యాధర్మమునకు తగనిమాటలు పలికినది. అపకీర్తిని వైధవ్యమును తెచ్చికొన్నది. సాభిప్రాయ విశేషణము కనుక ఇది పరికరాలంకారము. 2) 'ప్రమదా' అను కైకనామధేయము సాభిప్రాయము. విశేష్యము సాభిప్రాయమయినచో

పరికరాంకురాలంకారము. అభిప్రాయము ఏమనగా మదం కలది కనుకనే అపకీర్తిని లెక్కచేయలేదని అర్థము. 3) ఇచ్చట కృష్ణపక్షమున విసర్గలు నతాతః అని అధ్యాహారము చేయబడినవి.

అవతారిక:-అథ వనవాసార్థం రామే ప్రస్థితే సతి అహల్యోద్ధరణ ప్రసంగమాహ.

శ్లో॥ తామితో మత్త సూత్రామా
శాపాదేష విగానతామ్।
తాం నగావిషదేऽపాశా
మాత్రాసూత్తమతో మితా॥ 18

అవతారిక:- వనవాసమునకు బయలుదేటిన రాముడు మార్గమధ్యమున అహల్యను ఉద్ధరించుట, కృష్ణకథలో యమళార్జునభంగము వీటిని ఈ శ్లోకములో సూచించును.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) మత్త=మదించిన, సూత్రామ=ఇంద్రుడు, తామ్=అహల్యను, ఇతః=పొందెను, ఏషః=ఈ ఇంద్రుడు, విగానతామ్=సహస్ర నయనుడు అగు అసహ్యాకారమును, శాపాత్=గౌతమశాపమువలన, ఇతః= పొందెను.

భావము:- మదించిన ఇంద్రుడు అహల్యను సమీపించెను. గౌతమశాపమువలన సహస్రనేత్రవంతమయిన అసహ్య శరీరమును పొందెను. అనగా ఈ అహల్యా ప్రస్తావన వలన మిగిలిన అహల్యా కథను మనము ఊహింపవలయును.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) తామ్=పాశముతో కప్పబడిన అవస్థను అనుభవించి, నగ=కవలలయిన అర్జున(మద్ది)వృక్షములకు, అవిష=అమృతమును అనగా మోక్షమును, దే=కృష్ణుడు ఇచ్చినవాడు కాగా, (సా=ఆ యశోద), మాత్రాసు =పాలు, కుండ మొదలగు పదార్థములందు, అపాశా=అకర్షణబంధములేనిదై, ఉత్తమతః=లోకాతీతుడైన కృష్ణుని పక్షమున, మితా=మానమర్యాదలుగల దయ్యెను.

భావము:- పాశబద్ధుడయిన కృష్ణుడు జంట అర్జున వృక్షములకు ఱోలు ద్వారా మోక్షము ఇచ్చెను.ఆ దృశ్యమును చూచిన యశోద తన పాలు, కుండ మొదలగు పదార్థములపై ఆసక్తి వదలి కృష్ణునిపట్ల 'భక్తిమర్యాదలు' పెంచికొనెను.

విశేషములు:- 1) సూత్రామా-ఇంద్రుడు. కాని 'సూత్రామా' అనుపదము అప్రసిద్ధము. కాని చిత్రకావ్యము కనుక అవసరార్థమై హ్రస్వమును దీర్ఘము చేయుట 'ఆట' లో ఒక భాగము. దీనివలన రెండవ అర్థము కుదురును. 2) అహల్య, శాపము ఉద్ధరణము చెప్పలేదు. ఆ కథ అంతయు మనము ఊహింప వలసినదే. సాధ్యమయినంతగా చిత్రకావ్యమున 'కథ' చెప్పబడును. 3) కృష్ణ పక్షమున, 'తాం' వద్ద 'అనుభూయ' అను భావించి అని అధ్యాహారము చేయ వలెను. అట్లే వృక్షముల పేర్లు మొదలైనవి ఊహింపవలయును. 4) రామ వనవాస సందర్భములోనికి 'అహల్యా వృత్తాంతము' వాల్మీకి రామాయణము ప్రకారము రాదు. విశ్వామిత్రునితో వెళ్ళినపుడే దీని ప్రస్తావన. కనుక ఇది ఇతర రామాయణ ప్రభావము.

అవతారిక:- అథ శూర్పణఖాయాః ప్రాప్తాయాః నాసికా నికృంతనం కృతమితి, శాలినీ ఛందసాహ'

శ్లో॥ నాసావద్యాపత్రపాజ్ఞా వినోదీ
ధీరోఽనుత్యా సస్మితోద్యావిగీత్యా।
త్యాగీ విద్యాతోఽస్మి సత్యానురోధీ
దీనోఽవిజ్ఞా పాత్ర పద్యావసానా॥ 19

అవతారిక:- శూర్పణఖ ముక్కుచెవులు కోయుట, యమళార్జునులతో కృష్ణుని సంభాషణ ఇందులో ప్రస్తావింపబడినవి.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) నాసా=ముక్కునందు, అవద్యా=దోషముగల దయిన శూర్పణఖ, అపత్రపా=సిగ్గులేనిదై ఉన్నది, అజ్ఞా=రాముని అజ్ఞతో లక్ష్మణుడు, వినోదీ=వినోదముగలవాడయ్యెను, ధీరః=ఉదాత్తుడయిన రాముడు, అనుత్యా=శూర్పణఖా కృతమయిన నిందతో, అవిగీత్యా=అపకీర్తితోను, అద్య= ఇప్పుడు, సస్మితః=చిఱునవ్వుగలవాడు అయ్యెను.

భావము:- ముక్కుచెవులు కోసిన తరువాత శూర్పణఖ సిగ్గులేకుండా రాముని నిందించినది. రాముడు దాని నిందలకు చిఱునవ్వు నవ్వెను. లక్ష్మణుడు రామాజ్ఞను పాలించి వినోదము పొందెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) సత్య=సత్యమయిన పరబ్రహ్మతత్త్వమునందు,

అనురోధీ=ఆసక్తికల నేను (కృష్ణుడు), విద్యాతః='విద్య' పక్షము నుండి, త్యాగీ= దాతను అనగా జ్ఞానదాతను, అస్మి=అయియున్నాను, దీనః=లోకము విషయ సుఖాసక్తితో దీనముగా ఉన్నది, అవిజ్ఞా=అవిద్య అనగా అజ్ఞానము, పాత్ర=జ్ఞాన పాత్రులయిన వారియొక్క, పద్యా=జ్ఞానమార్గమే, అవసానా=అవధి/నాశముగా గలది.

భావము:- నారద శాపమునుండి మోక్షముపొందిన యమళార్జునులతో కృష్ణుడు ఇట్లు చెప్పెను. ఓయీ! నేను సత్యస్వరూపమయిన బ్రహ్మమును. జ్ఞానదానము చేయువాడను. జ్ఞానహీనులయి విషయవాంఛలతోనున్న జనము దైన్యముగా నున్నది. ఈ అజ్ఞానము యోగ్యులయిన జ్ఞానుల మార్గము నాశ్రయించు వఱకు కొనసాగును. అనగా జ్ఞానముతో అజ్ఞానము నశించును.

అవతారిక:- అథ పంచవటీవనే సపరిగ్రహే రామే కృతాధివాసే సతి కించి దపూర్వం జాతమిత్యాహ.

శ్లో॥ సంభావితం భిక్షురగాదగారం
యాతాధిరాప స్వనఘాజవంశః।
శవం జఘాన స్వపరాధితాయా
రంగాదగారక్షుభితం విభాసమ్॥ 20

అవతారిక:- పంచవటీ ప్రాంతమున ప్రవేశించిన యతిరూప రావణునకు సీత దొఱకెనని; కృష్ణుడు కంసుని చంపెనని తెలిపిన శ్లోకమిది.

ప్రతిపదార్థము:-(రామపక్షమున) భిక్షుః=యతిరూపుడైన రావణుడు, సంభావితమ్ =మంచిదిగా రామునిచే భావించబడిన, అగారమ్=పంచవటీరూపనివాస స్థానమును, అగాత్=పొందెను/చేరెను, సు=మిక్కిలి, అనఘ=పాపరహితమయిన, అజ=బ్రహ్మయొక్క వంశః=వంశముగల రావణుడు, యాత=పోయిన, ఆధిః =సీత దొఱకదేమో అను దిగులుగలవాడై, ఆప=సీతను పట్టికొన గలిగెను.

భావము:- యతివేషధారి అయిన రావణుడు ప్రశాంతమయి పవిత్రమయిన పంచవటీ ప్రాంతమును చేరుకొనెను. బ్రహ్మవంశీయుడయిన ఆ మహాత్ముడు అచ్చట సీతను పరిగ్రహించెను. అంతటితో అతని దిగులు తీరెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున), (కృష్ణః=కృష్ణుడు), అగార=తన పరివారము

నందు, క్షుభితమ్=కృష్ణుని చంపలేనందుకు బాధపడినవాడును, విభాసమ్=కళ తప్పినవాడును, శవమ్=అందువలననే 'ప్రేత' ప్రాయముగానున్న కంసుని, స్వపరాధితాయాః=మిక్కిలి అపరాధి అగుటవలన, రంగాత్=రంగస్థలమునుండి త్రోసి, జఘాన=చంపెను.

భావము:- కృష్ణుడు అందఱిని జయించుచుండెను. చాణూరుని చంపెను. అందువలన తన పరివారముపై కంసునకు చాలకోపముగానుండెను. జీవకళ తప్పి ప్రేతకళపడినది. అపుడు కృష్ణుడు రంగస్థలమునుండి కంసుని పడద్రోసి చంపెను. కంసుడు చేసిన అనేక అపరాధములకు ఇది శిక్ష.

విశేషములు:-బ్రహ్మవంశమునపుట్టినవాడు దొంగవేషముతో పరదారగ్రహణము చేయుట తగనిది అని ఇచ్చట విషమాలంకార ధ్వని. 2) మంచిదిగా సంభావింప బడిన చోట రావణుడు ప్రవేశించుట అనునది రాముని వైపునుంచి మరొక విషమాలంకార ధ్వని. 3) సంభావితం అనుదానిని క్రియావిశేషణముగా చెప్ప వచ్చును. గౌరవయోగ్యముగా భిక్షువేషధరుడై అని అర్థమువచ్చును. తన వేషానికి తగనిపని గనుక అపుడున్ను విషమాలంకార ధ్వనివచ్చును. 4) 'శవం' అనుచో కంసుని శవముగా చెప్పుట లక్షణ. 5) అగారము అనగా ఇల్లు. ఈ పదముచే 'హోమ్' అనగా దేశము, పోలీసులు అర్థమయినట్లు తన పరివారము అని అర్థము వచ్చును. 6) కృష్ణః=అను పదము అధ్యాహారము.

అవతారిక:- అథ మృగయాపరావృత్తస్య రామస్య జానకీ మపశ్యతః నిర్వేద మాహ.

శ్లో॥ తయాతితారస్వనయాగతం మా
లోకాపవాద ద్వితయం పినాకే।
కేనాపియం తద్విదవాప కాలో
మాతంగయాన స్వరతాతియాతః॥ 21

అవతారిక:- వేటనుంచి తిరిగి వచ్చిన రాముడు సీత కనపడక విచారించుట, కంస వధ గురించి కవి అభిప్రాయములు ఇందులో వర్ణింపబడెను.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) అతితార=మిక్కిలి 'బిగ్గర' అయిన, స్వనయా= నాదముగల, తయా=ఆసీతచేత, గతమ్=పోబడినది, మా=అయ్యో!, పినాకే= నాధనుస్సుమీద, లోకాపవాద=అప్రతిష్ఠలయొక్కద్వితయమ్=ద్వయము వచ్చినది.

**భావము:-** ఆ 'సీత' చాల ఆక్రోశించుచు వెళ్ళియుండవచ్చును. అయ్యో! నా ధనుస్సుపై '2' లోకాపవాదములు వచ్చిపడినవి. 1) అజ్ఞానముతో లేడి వెంబడి పడుట, 2) భార్యను రక్షించికొనలేకపోవుట.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) మాతంగ=కువలయాపీడము అను ఏనుగు యొక్క, యాన=పరుగెత్తుట, స్వరతా=స్వరము-ఘీంకారములను, అతియాతః =అతిక్రమించిన, కాలః=కాలము, కాలరూపుడయిన కృష్ణుడు, తద్విత్=ఆ 'కంస' మరణక్షణమును గుర్తించినదై / గుర్తించినవాడై, యమ్=ఆకంసుని, కేనాపి= ఒకానొక పద్ధతితో, అవాప=పొందెను.

**భావము:-** పరబ్రహ్మస్వరూపుడైన కృష్ణునకు కంసునిపై ద్వేషములేదు. వానికి మరణ క్షణము వచ్చినది కనుక కాలరూపుడైన కృష్ణుడు కువలయాపీడము నయినను లంఘించి ఏదో ఒక విధముగా కంసుని సంహరించెను.

**విశేషములు:-** 1) తారస్వనయా - ఇచ్చట కవి, తన వ్యాఖ్యలో సీత అఱచినట్లు చెప్పెను. కాని అది సమంజసముగా లేదు. కనుక మారీచుడు చేసిన తారస్వనము విని అని అర్థము చెప్పినచో సీత మారీచునికేక విని తనకొఱకే బయలుదేఱిన దేమో అని రాముడు శంకించుట - బాగుండును. తారస్వనముగలదై అనగా విన్నదై అని లక్షణ చేయవచ్చును. 2) పినాకము=అనగా ధనుస్సు అను సామాన్యార్థములో వాడబడినది. 3) కాలము సమీపించినచో ఏదయినను ఎంత విఘ్నముచేసినను జరుగక మానదు. అని అర్థాంతరన్యాస ధ్వని.

**అవతారిక:-** అథ రామస్య పునః జానకీం ప్రతి నిర్వేదోక్తి మాహ.

శ్లో॥ శవేఽవిదా చిత్రకురంగమాలా
పంచావటీనర్మ న రోచతే వా।
వాతేఽచరో నర్మనటీవ చాపం
లామాగరం కుత్రచిదావివేశ॥ 22

**అవతారిక:-** సీతను గూర్చి రాముని విచారము; కృష్ణుని సామర్థ్యము, గూర్చి యీ శ్లోకమున చెప్పబడినది.

**ప్రతిపదార్థము:-**(రామపక్షమున)శవే=శవప్రాయుడయిన లేదా శవభక్షకుడయిన మారీచుని యందు, చిత్ర=చిత్రమయిన అనగా రంగురంగుల, కురంగ=లేడి యొక్క, మాలా(యా)=మాల(య) ఉన్నదని, అవిదా=అజ్ఞానముతో భ్రాంతిపడిన

నాతో, పంచావటీ=పంచవటిలో, నర్మ=కలసిసరదాగా ఉండుట, న రోచతే వా= నచ్చలేదా అందుకని కనబడలేదా?

**భావము:-** ఓ సీతా! రాక్షసుడు లేడికాదని, ఇది లేడిగా కనబడే మాయ అని తెలియక అజ్ఞానముతో వెళ్ళిన నాతో ఈ పంచవటిలో నివాసము నచ్చక నన్ను వదలి వెళ్ళిపోయినావా? అని రాముడు విలపించెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) (కృష్ణః=కృష్ణుడు), వాతే=తృణావర్తుడు అను సుడిగాలి ముందు, అచరః=కదలకయుండెను, లా(యా)మా=పూతనయొక్క, గరమ్=విషము, నర్మఇవ=ఆటవలె, కుత్రచిత్=ఎక్కడనో, ఆవివేశ=ప్రవేశించెను, నర్మ=ఈ విలాసము, నటీ=నర్తకి, చాపమివ=ధనుస్సువంటి కనుబొమలను ఆడించి నట్లుగా ఉన్నది.

**భావము:-** ఈ కృష్ణుడు కంసవధకు ముందైనను మహా ప్రభావమును చూపెను. తృణావర్తుడు సుడిగాలిరూపముతో వచ్చినను తొణకలేదు. బెణకలేదు. పూతన విషము ఎటుపోయినదో సమాచారమే లేదు. ఈ క్రీడలన్నియు ఒక నర్తకి కను బొమ్మలు త్రిప్పినంత తేలికగా జరిగినది.

**విశేషములు:-** 1) ఇందులో 'మాలా' అనియు విలోమముగా 'లామా' అనియు పదములు కలవు. కాని అర్థము లేదు. కాని వ్యాఖ్యానమునందును ఆపదములట్లే కలవు. అయినను కవి వానికి అర్థము వ్రాయలేదు. ఇంత విరుద్ధమయిన పదములకు అర్థము ఎందుకు వ్రాయలేదు? కనుక ఇవి మామూలు పదములు అయియుండును. అని ఊహ. అర్థము ప్రకారము 'మాయా - యామా' అనుకొన్నచో, సరిపోవును.

కురంగమాయ=లేడి అనే మాయ, యామా=యమురాలు అయిన పూతన అని అర్థము. 2) అయితే 'యామా' అనుచోట వ్యాకరణ ప్రకారము 'యామ్యా' అని ఒక ప్రత్యయమురావలెను. లేక ఏదో విధముగా 'అణ్' చేసినను స్త్రీ ప్రత్యయములో 'యామీ' కావలెను. కనుక ఇచ్చట 'యమా' అనియే ఉండ వలయును. అయితే దీర్ఘము చిత్రకావ్య నియమప్రకారము అవసరము కనుక వచ్చినది. 3) ఈ శ్లోకములోనే 'పంచవటీ' కి బదులు 'పంచావటీ' అని దీర్ఘము తీయబడినది. అట్లే యమా=యామా అయినది అని సారాంశము. 4) శవము అనగా శవభక్షకుడయిన అను అర్థము లక్షణతో చేయవలయును. 5) మాయా=

దీని వద్ద 'ఉన్నదని' అను పదమును అధ్యాహారము చేయవలెను. 6) నర్మ, నటీవ, '2' సార్లు తెచ్చికొనవలెను. 7) 'కురంగ' ఇది విలోమంలో 'యామాగంర' కావలెను. కాని 'యామాగరం' అని చదువుట చిత్రకావ్యముపై 'సానుభూతి' తోనే. 8) బాల్యములోనే పూతనను, తృణావర్తుని లెక్కచేయనివాడు కౌమారమున కంసుని లెక్కచేయునా అని 'కైముతిక' న్యాయము ధ్వనించును. అనగా 'కావ్యార్థా పత్త్యలంకార' ధ్వని. 9) రామాయణార్థమున సీత తనను వదలివెళ్ళుటకు కారణము ఉత్ప్రేక్షింపబడినది. కనుక హేతూత్ప్రేక్ష. భాగవతార్థమున 'నటి కనుబొమలను కదలించినట్లు' అని ఉపమాలంకారము.

**అవతారిక:-** అథ జానకీం స్కంధే గృహీత్వా సత్వరం నిర్గతస్య రావణస్య జటాయునా సాకం సంగోఽభూదితి రథోద్ధతయాహ.

**శ్లో॥ నేహ వాక్షిపసి పక్షికంధరా**
**మాలినీ స్వమత మత్త దూయతే।**
**తే యదూత్తమ తమ స్వనీలిమా**
**రాధకం క్షిపసి పక్షివాహనే॥ 23**

**అవతారిక:-** సీతాదేవిని ఎత్తికొనిపోయిన రావణునకు జటాయువుతో 'భేటీ' అయ్యెనని, కంసవధ తర్వాత అక్రూరాదులు కృష్ణుని స్తుతించిరని ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) స్వమత=నీ పట్టుదలతోనే, మత్త=మదించిన వాడా! రావణా!, పక్షి=తనయందు పక్షపాతముకల పక్షినయిన నాయందు, కంధరా=కాపాడుమను స్వరముగల, మాలినీ=యీ 'పుష్పము' వంటి సీత, దూయతే=బాధపడుచున్నది, ఇహ=ఇచ్చటనే, న క్షిపసి వా=వదలిపెట్టనిచో నీతో పోరాడి వదలించెదను.

**భావము:-** ఓ రాక్షసరాజా! నీవు నీ పట్టుదలతో మదించినావు. నాయందు నమ్మకముతో అఱచుచున్న యీమె చాల బాధపడుచున్నది. ఆమెను ఇచ్చట వదలిపెట్టనిచో నేను పోరాడి వదలించెదను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) యదూత్తమతమ=యాదవులతో అత్యంత శ్రేష్ఠుడవయిన కృష్ణా!, స్వ=తన / నీయొక్క, నీలిమ=నల్లదనమును అనగా రూపము యొక్క ఆరాధకం=సేవచేయువానిని, పక్షివాహనే=గరుడవాహనము నందు, క్షిపసి=పడవేసెదవు.

**భావము:-** అక్రూరుడు మొదలగువారు కృష్ణుని స్తుతించుచున్నారు. కృష్ణా! నీవు యాదవశ్రేష్ఠుడవు. నీ నీలమేఘవర్ణమును ఆరాధించినవారికి నీవు వైకుంఠమును ప్రసాదించెదవు. పరోక్షముగా ఆరాధించినవారికే వైకుంఠమును ఇచ్చునపుడు ప్రత్యక్షముగా నీతో పోరి మరణించిన కంసునకు రానిదేమున్నది. నీతో వైరము గూడా ఆరాధన గదా!

**విశేషములు:-** 1) పరోక్ష సేవకులకు వైకుంఠమిచ్చెదవు అనుటలో ప్రత్యక్ష వైర భక్తుడై మరణించిన కంసుని సంగతి ఏమి చెప్పవలెను? అని 'కావ్యార్థాపత్తి' అలంకారము ధ్వని. 2) నీలిమ-అనుపదము నీలమేఘశ్యామలమయిన కృష్ణ రూపమును లక్షణతో చెప్పును.

**అవతారిక:-** తతో జటాయువచనాత్ జానకీ శుద్ధిం లబ్ధ్వాపి దక్షిణతః చలితస్య రామస్య అవస్థామాహ.

శ్లో॥ వనాంత యానస్వణువేదనాసు
యోషామృతేఽ రణ్యగతా విరోధీ।
ధీరోఽ వితాగణ్య రతే మృషాయో
సునాద వేణుస్వనయాతనాం వః॥ 24

**అవతారిక:-** జటాయువు మాట ద్వారా 'సీతా' వార్త తెలిసిన రాముడు దక్షిణ దిక్కుగా వెళ్ళిన సంగతి, కృష్ణుడు మధురకు వెళ్ళిన తర్వాత గోపికల విరహ సంభాషణ - ఈ శ్లోకములో వర్ణింపబడెను.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) యోషామృతే=సీతలేకపోవుటవలన, వనాంత =అరణ్యములందు, యాన=పర్యటించుటయందలి, స్వణు=స్వల్పమయిన, వేద నాసు=బాధలలో అనగా లక్ష్మణుడు ఓదార్చుటవలన తగ్గిన బాధలలో, అరణ్యగత =వనచరులయిన క్రోతులతో, అవిరోధీ=మిత్రుడై విశ్రాంతిచెందెను.

**భావము:-** సీతావిరహముతో బాధపడుచు అడవిలో తిరుగుచున్న రాముని లక్ష్మణుడు ఓదార్చెను. దానివలన రాముని బాధ తగ్గెను. తరువాత వనచరులతో మైత్రి సంపాదించెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) అగణ్య=అయోగ్యమయిన, రతే=మధురానగరీ స్త్రీవిహారములలో, ధీరః=ధైర్యశాలి అయిన కృష్ణుడు, వః=మిమ్ములను, అవితా=

రక్షింపగలడు అని, మృషా=అబద్ధము, యః=ఏ కృష్ణుడు, సునాద=గొప్పనాదము కల, వేణుస్వన=వేణుగానమువలనవచ్చిన, యాతనామ్=మనబాధను, న స్మరతి =స్మరింపడో? (కిమ్=ఏమి?).

**భావము:-** మధురాస్త్రీలతో మనోహరముగా విహరించుటలో నైపుణ్యము గడించిన ఆ కృష్ణుడు మళ్ళీవచ్చి మనలను రక్షించునని నమ్మకము లేదు. అలనాటి వేణునాదముతో మనము పడిన విరహము ఆయనకు గుర్తుండదా!

**అవతారిక:-** అథ పూర్వశ్లోకే అణు వేదనాస్వితి పదేన మహతి దుఃఖే సతి కథం విశ్రాంతిరిత్యాహ.

శ్లో॥ కిం ను తోయరసా పంపా
న సేవా నియతేన వై।
వైనతేయ నివాసేన
పాపం సారయతో ను కిమ్॥ 25

**అవతారిక:-** రాముడు తన మహాదుఃఖమును తీర్చుకొనుటకున్న అవకాశము లను, గోపికలు ఉద్ధవుని పరిహసించుటను ఈ శ్లోకము చిత్రించుచున్నది.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) తోయ=నీటియందు, రసా=రుచిగల, పంపా =పంపానది, కింను=లేదా?, వై=నిశ్చయముగా, నియతేన=నిత్యభక్తుడైన హనుమంతునిచేత, సేవా=సేవ, న కిమ్=లేదా.

**భావము:-** మధుర జలముగల పంపానది ఉన్నది. నిత్యసేవకుడయిన ఆంజనేయుడు కలడు. కనుక రాముడు తన దుఃఖమును తగ్గించుకొని విశ్రాంతి పొందగలిగెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) వైనతేయ=గరుత్మంతునియందు, నివాసేన= నివసించువాడయిన కృష్ణునిచేత,పాపమ్=పాపమును, సారయతః=పోగొట్టుకొను చున్న నీకు(ఉద్ధవునకు), కింను(వాచ్యమ్)=ఇది చెప్పతగినదేనా?

**భావము:-** శ్రీకృష్ణ సేవవలన పుణాత్ముడవయిన నీవు ఇట్లు చెప్పదగునా? అని గోపికలు ఉద్ధవుని నిలదీసిరి.

**విశేషములు:-** 1) నియతేన=నిత్యభక్తుడయిన హనుమంతుడు అని కవి వ్యాఖ్యానము. కాని అదే కవి తరువాత శ్లోకములో సుగ్రీవ సఖ్యము గూర్చి చెప్పుచున్నాడు. సుగ్రీవ సఖ్యముకన్న ముందు ఆంజనేయసేవ లేదు గదా!, కనుక

'ఆంజనేయ' అనే అర్థము సుసుంగతము కాదు. 2) నిత్యభక్తుడు - అందునను వనవాసములో లక్ష్మణుడు. కనుక 'లక్ష్మణునిచేత' అని చెప్పుటయే సబబు. 3) 'వై' అనునది లౌకిక సాహిత్యమునందు ప్రయోగము లేదు. వేద, ఆర్ష సాహిత్యములందు గలదు. ఇచ్చట 'చిత్రకవిత' కనుక కొంత అనుమతి.

**అవతారిక:-** అథ వాలినా హృతదారః సుగ్రీవః రామం శరణం ప్రయాతః ఇత్యాహ.

**శ్లో॥** స నతాతపహా తేనే
స్వం శేనావిహితాగసమ్।
సంగతాహివినాశే స్వం
నేతేహాప తతాన సః॥ 26

**అవతారిక:-**వాలివలన భార్యను కోల్పోయిన సుగ్రీవుడు రాముని శరణుజొచ్చెను అనియు, కృష్ణుడు మిమ్ములను వదలడని ఉద్ధవుడు గోపికలకు చెప్పుటయు ఇందులో వర్ణింపబడెను.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) నత=తనకు నమస్కరించిన వారియొక్క ఆతప=సంతాపములను, హా=పోగొట్టువాడయిన, సః=ఆ రాముడు, అవిహిత= చేయబడని, ఆగసమ్=అపరాధములు గల, స్వమ్=తనవాడయిన సుగ్రీవుని, శేన=శుభముతో, తేనే=విస్తరింపజేసెను.

**భావము:-** శరణాగతరక్షకుడయిన శ్రీరామచంద్రుడు నిరపరాధుడై బాధపడుచు తన శరణార్థి అయిన సుగ్రీవునకు శుభములను చేకూర్చెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) సః=ఆ, నేతా=జగన్నాథుడయిన కృష్ణుడు, ఇహ =ఈ సరస్వతీ తీరప్రాంతమున, స్వమ్=తనవాడయిన నందుని, ఆప=పొందెను, సంగత=వచ్చిపడిన, అహి=సర్పము యొక్క వినాశే=ఆపదయందు, స్వమ్=తన గోపికా జనమును, తతాన=వృద్ధి పొందించెను.

**భావము:-** గోపికలారా! కృష్ణుడు స్వజనమును ఉద్ధరించును. నందుని మొసలి పట్టినపుడు ఆయన రక్షించెను గదా! (భాగవతదశమస్కంధములో) నందుడు యమునా స్నానము చేయునపుడు వరుణదూత నందుని వరుణలోకమునకు తీసికొనిపోయెను. కృష్ణుడు నందుని రక్షించి బృందావనమునకు తెచ్చెను. అట్లే గోకులమును కాళీయ బాధనుంచి రక్షించెను. కనుక మిమ్ము రక్షింపగలడు.

విశేషములు:- 1) నందుడు యమునలో స్నానముచేయుచుండగా వరుణదూత వలన ఆపదవచ్చినది. కాని కవి వ్యాఖ్యలో సరస్వతీ తీరమునందని చెప్పబడినది. భాగవతమునకు ఈ విషయము భిన్నము. 2) అహి=అనగా అఘాసురుడు, కాళియుడు కావచ్చును. కృష్ణుడు అఘాసురుని మదము అణచి గోకులమును రక్షించెను.

అవతారిక:- అథ వాలినం హత్వా సుగ్రీవపత్నీం ముమోచ - ఇత్యాహ.

శ్లో॥ కపితాలవిభాగేన యోషాదోఽనునయేన సః।
స నయే నను దోషాయో నగే భావిలతాపికః॥ 27

అవతారిక:- వాలిని చంపి రాముడు సుగ్రీవ భార్యను సుగ్రీవునకు ఇప్పించుట, కృష్ణుడు దుర్లభుడని గోపికలు పలుకుట యీ శ్లోకమున వర్ణింపబడినవి.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) సః=ఆరాముడు, అనునయేన=ప్రేమతో, కపి=వాలియొక్క, తాల=తాలవృక్షములయొక్క, విభాగేన=విచ్ఛేదనముచేత, యోషా=సుగ్రీవభార్యను, దః=సుగ్రీవునకు ఇచ్చినవాడు అయ్యెను.

భావము:- రాముడు తాళవృక్షములను ఒకేబాణముతో ఛేదించెను. తరువాత వాలిని ఒకే బాణముతో ఛేదించెను. అభిమానముతో సుగ్రీవునకు 'రుమ' ను ఇప్పించెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) సః=ఆ కృష్ణుడు, నయే=నీతియందు, నను=లేదుగదా!, దోషాయః=దోషములను ఇచ్చువాడుగా, (అస్తి=ఉన్నాడు), సః=ఆ కృష్ణుడు, నగే=పర్వతమునందు, భావి=పుట్టబోవు, లతా=మామిడి తీగయందలి, పికః=కోకిల అగును అనగా దుర్లభుడు.

భావము:- ఉద్ధవా! కృష్ణుడు నీతిమంతుడుగాడు. మమ్ములను వదలి వెళ్ళినాడు. ఆయన మాకు విరహదోషమును తెచ్చినాడు. మాకిక దొఅకడు. కొండ మీద ముందెప్పుడో మొలవబోయే మామిడి తీగపై వాలబోవు కోకిల ఎంత దూరమో మాకాతడు అంతదూరము.

విశేషములు:- 1) మామిడి తీగ అనగా లేతదవ్వగా పుట్టిన మామిడి మొక్క లేదా రాళ్ళమీద గోడలలోను పుట్టు రావి మొక్కలు తీగలవలె నుండి వ్రేలాడు చుండును. అట్లే కొండరాయిలో పుట్టిన మామిడి మొక్క తీగవలె దుర్బలముగా

నుండును. అట్టి కొండజాతి అయిన మావంటి గోపికలకు కోకిలవంటి కృష్ణుడు దొఱకునా? అని సందేహము. 2) ఇచ్చట అప్రస్తుత వృత్తాంతముతో ప్రస్తుతము నకు సమన్వయము కనుక 'లలితాలంకారము' మఱియు అసంభవాలంకారధ్వని. ఇది వృత్తాంతము కాదనుకొన్న పక్షమున కృష్ణుని విషయములో 'కోకిల' అని రూపకాలంకారము.

**అవతారిక:-** అథ వాలిపుత్రః అంగదః రామం ప్రతి వదతి.

**శ్లో॥** తేసభా ప్రకపి వర్ణమాలికా
నాల్పకప్రసరమభ్ర కల్పితా।
తాల్పిక భ్రమరసప్రకల్పనా
కాలిమార్ణవ పిక ప్రభాసతే॥ 28

**అవతారిక:-** వాలి పుత్రుడు అయిన అంగదుడు రాముని గూర్చి మాట్లాడుట, గోపికలు కోకిలనుద్దేశించి మాట్లాడుట ఈ విషయముల గూర్చి యీ శ్లోకమున వివరింపబడినవి.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) రామ!=(రామచంద్రా!), తే=నీ, సభా=సభ, ప్రకపి=పెద్దకోతులయొక్క, వర్ణ=విచిత్రవర్ణములయొక్క, మాలికా=సమూహము కలది, అల్పక=అల్పమయిన, ప్రసరమ్=వ్యాప్తి కలది, అభ్ర=ఆకాశమునందు, కల్పితా=కల్పిత మయినది, న=కాదు.

**భావము:-** రామా! మనసభ విచిత్రవర్ణులయిన వానర వీరులతో నిండియున్నది. కాని చాల చిన్నది. ఆకాశముదాక వ్యాపించినది కాదు. రాక్షససేన మన కన్న చాల బహుళముగానున్నది. అని అంగదుడు రామునితో చెప్పెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) కాలిమ=నల్లదనమునకు, అర్ణవ=సముద్రము వంటి, పిక=కోకిలా! నీయందు, తాల్పిక=స్వప్నమునందలి, భ్రమ=సురత భ్రాంతి యందలి, రసప్రకల్పనా=రసముఎంతో అదే, ప్రభాసతే=కనబడుచున్నది.

**భావము:-** నల్లదనమునకు నిధిగాఉన్న ఓ కోకిలా! నీతో సురతవాంఛలో ఉన్నరసము స్వప్న సురతవాంఛలో ఉన్న రసముతో సమానము.

**విశేషములు:-** 1) ఇందు ప్రధాన అలంకారము 'గూఢోక్తి'. కృష్ణుని మనసులో ఉంచుకొని కోకిల మీద పెట్టి (కృష్ణుని పక్షములో) గోపికలు మాట్లాడిరి. 2)

గూఢోక్తిలో నిదర్శనాలంకారము కలదు. అయితే అది వ్యంగ్యముగా కలదు. కృష్ణునితో సురతరుచి స్వప్నములోని సురతరుచియే అని వాక్యార్థముల ఆరోపము గమ్యము. కనుక నిదర్శనాలంకార ధ్వని. 3) ఇతర అధ్యాహారములు అర్థమును బట్టి చేయబడినవి.

అవతారిక:- అథ రావణో యద్యపి సకలసైన్యసన్నాహవానస్తి తథాపి తత్ర వీర లక్షణం నాస్తి ఇత్యాహ.

శ్లో॥ రావణేఽక్షిపతన త్రపానతే
నాల్పక భ్రమణ మక్రమాతురమ్।
రంతుమాక్రమణ మభ్రకల్పనా
తేన పాత్ర నత పక్షిణే వరా॥ 29

అవతారిక:- రావణుడు సకలసైన్య సన్నాహము కలవాడయినను అతనియందు వీరలక్షణములేదని; గోపికలకు ధ్యాన యోగమే శరణ్యమనియు ఈ శ్లోకమున చెప్పిన విషయము.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) రావణే=రావణాసురుడు, అక్రమ=అక్రమ మయిన పరస్త్రీ హరణముచేత, ఆతురమ్=వ్యాకులమగునట్లుగా, అక్షి=రాముని దృష్టియొక్క, పతన=పడుటచేత వచ్చిన, త్రపా=సిగ్గుచేత, నతే=తలవంచి యుండగా, అల్పక=స్వల్పమయిన, భ్రమణమ్=చిత్తభ్రమ లేదా భయము, నకిమ్ =కలుగదా!

భావము:- అక్రమముగా కామాతురుడై పరస్త్రీని అపహరించిన ఆ రావణుడు ఎంత వీరుడయినను, రామా! నీ దృష్టి సోకినంతనే, తన అపచారమునకు సిగ్గు పడి తలవంచికొని భయపడును.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) (గోప్యః=గోపికలారా!,) తేన=ఆ కృష్ణునిచేత, ఆక్రమణమ్=రాక్షసులను ఆక్రమించి చంపుట, అభ్ర=మేఘశరీరముయొక్క కల్పన=స్వీకరణము, రంతుమ్=ప్రపంచ క్రీడ కొఱకు చేయబడును, తేన= అందుచేత, పాత్ర=యోగ్యులయిన భక్తులందు, నత=వంగిన, పక్షిణే=పక్షిగల/ పక్షముగల కృష్ణునకు, వరా=మేఘశ్యామలమూర్తి కల్పింపబడినది.

భావము:- గోపికలారా! శత్రువధ, రాక్షస సంహారము, మేఘశ్యామలమయిన

శరీరము ఇవి అన్నియు కృష్ణభగవానుడు తన క్రీడకొఱకు కల్పించికొనినవి. అందులో మేఘశ్యామల శరీరము పాత్రులయిన భక్తులకొఱకు వరింపబడిన రూపము. కనుక కృష్ణుడు మీకు ధ్యానమున సాక్షాత్కరించును.

**విశేషములు:-** 1) పాత్రనతపక్షిణే - వద్ద కవివ్యాఖ్యలో పాత్రమునందు నతులయిన పురుషుల పక్షము గలవాడు అని అర్థము. ఇందు బహువ్రీహిపై మత్వర్థీయము చేయుట జరిగినది. అది యోగ్యము కాదు. కనుక పాత్రులయిన భక్తులయందు నతమయిన గరుత్మంతుడు గలవాడనినచో అట్టి భక్తులవద్ద దిగువాడు అని అర్థము వచ్చును. ఈ యర్థము బాగుండును.

**అవ:-** అథ సీతా శుద్ధ్యర్థం ఆదిష్టః హనుమాన్ రామం ప్రతి విద్యున్మాలయాహ.

శ్లో॥ దైవేయోగే సేవాదానం - శంకా నాయే లంకాయానే।
నేయాకాలం యేనాకాశం - నందావాసే గేయో వేదైః॥ 30

**అవతారిక:-** సీతాదేవిని అన్వేషించుటకు బయలుదేరబోవుచు ఆంజనేయుడు రామునితో పలికిన మాట, ఉద్ధవుడు చేసిన కృష్ణస్తుతి ఇందులో వర్ణింపబడినవి.

**ప్రతిపదార్థము:-**(రామపక్షమున)అయే!=ఓ రామా!, దైవే=దైవసంబంధమయిన, యోగే=నీ సంబంధమునందు, సేవా=సేవయొక్క దానమ్=ఇచ్చుటకలదు కనుక, లంకాయానే=లంకాప్రయాణమునందు, శంకా=సందేహము, న=లేదు.

**భావము:-** శ్రీరామచంద్రప్రభూ! దేవుడయిన నీతో యోగము కలిగినది. నీకు సేవ చేయుట నాకు లభించినది. తప్పక లంకకు వెళ్ళెదను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) యేన=ఎవనిచేత, ఆకాశమ్=ఆకాశము, నేయాకాలమ్=కాలమునందు కలపదగినదో, వేదైః=వేదములచేత, గేయః=స్తుతింపబడదగిన ఆ కృష్ణుడు, నంద=నందునియొక్క ఆవాసే=నివాసగృహము నందుండుట మీ భాగ్యము.

**భావము:-** గోపికలారా! పంచభూతములలో మహాభూతమయిన ఆకాశమును గూడా తన స్వరూపమయిన కాలములో కలుపగల ఆ కృష్ణుడు నందుని యింట మీకు లభించెను. ఇది మీ భాగ్యము. నిజముగా ఆ వేదవేద్యుని పొందుటకు మీరు చేసిన శ్రమ ఎంతటిదో కదా! అని ఉద్ధవుడు అనెను.

**విశేషములు:-** కృష్ణుని అర్థమున ఇందు 'ఉదాత్తాలంకారము'. నంద గృహము యొక్క అదృష్టము చెప్పబడినది.

అవతారిక:- అథ జానకీశుద్ధిం కృత్వా పరావృత్తో హనుమాన్ రామం ప్రతి వదతీతి సమాక్షరయా శాలిన్యాహ.

శ్లో॥ శంకావజ్ఞానుత్త్వనుజ్ఞావకాశమ్,
యానే నద్యాముగ్రముద్యాననేయా।
యానే నద్యా ముగ్రముద్యాననేయా
శంకావజ్ఞానుత్త్వనుజ్ఞావకాశమ్॥ 31

అవతారిక:- జానకిని అన్వేషించి తిరిగి వచ్చిన 'హనుమ' రామునితో పలికిన మాటలు, గోకులము నుంచి తిరిగివచ్చిన ఉద్ధవుడు కృష్ణునితో చెప్పిన వార్తలు ఈ శ్లోకవిషయములు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) (రామ=ఓ రామా!, సా=ఆ సీత,) నద్యామ్= నదియందు, ఉగ్రమ్=అతికష్టముగా, ఉద్యాన=ఉద్యానవనమునుంచి, నేయా= తీసికొనిరాదగినది, అహమ్=నేను, అనుజ్ఞా=నీ అనుజ్ఞవలన, అవకాశమ్= అవకాశమును పొంది, శంకా=రాక్షస భయమును, అవజ్ఞా=వారుచేసిన పరాభవమును, నుత్తు=పోగొట్టినవాడనయితిని.

భావము:- రామా! ఆ సీతాదేవి లంకలో నది ఒడ్డునగల ఉద్యానవనము (అశోక వనములో) లో ఉన్నది. అచ్చటనుంచి ఆమెను తెచ్చుటకు బలమయిన ప్రయత్నము చేయవలయును. నేను నీ అనుమతి వలన అవకాశము పొందిన వాడనై లంకలో రాక్షస భయము లేక సంచరించితిని. నాకు చేసిన పరాభవము లకు బదులు తీర్చి వచ్చితిని.

ప్రతిపదార్థము:-(కృష్ణపక్షమున) ఉద్యాన=ఒకనాడు నీవు ఉద్యానమునకు, నేయా =తీసికొని వెళ్ళిన ఒక గోపిక మాత్రము, నద్యామ్=యమునానదీ తీరమున, యానే=ప్రయాణమునందు, ఉగ్రమ్=చాలతీవ్రముగా, శంకా=బంధుభయము, అవజ్ఞా=అనాదరణలను, నుత్తు=పోగొట్టుకొన్నదై, అనుజ్ఞా=నీ అనుజ్ఞతోవచ్చు, అవకాశమ్=అవకాశమును కోరిఉన్నది.

భావము:- కృష్ణుడు ఒకనాడు నీవు ఉద్యానవనమున భుజముపై మోసి తెచ్చిన ఒక గోపిక (రాధ?)మాత్రము యమునాతీరమున ప్రయాణమునకు ఎదురుచూచు చున్నది. ఆమెకు బంధుభయము అవమానములు లెక్కలేదు. నీ అనుజ్ఞ కొఱకు ఎదురుచూచుచున్నది. మిగిలిన గోపికలను నేను సమాధానపఱచితిని.

విశేషములు:- 1) ఇందులో మధుర భక్తిలో ఒక గోపిక బహుశః 'రాధ' అభిసారికగా చెప్పబడినది. 2) ఇది 1, 4లో సమాక్షర 2, 3లోను సమాక్షర.

అవతారిక:-అథ సముద్రం నియమ్య లంకాం గంతుం శక్తోఽపి రామః క్షుద్ర వానర కౌతుకం ద్రష్టుం సేతుబంధార్థ మాదిదేశ ఇతి ఆహ.

శ్లో॥ వాదిదేశ ద్విసీతాయం
యం పాథోయన సేతవే।
వైతసేన యథోపాయం
యంతాసీద్విశదే దివా॥ 32

అవతారిక:-సముద్రమును నియమించి లంకకు పోగలిగినను వానరుల 'సరదా' కొఱకు 'సేతుబంధము' చేసెను అనియు, కృష్ణుడు తన మాతామహులకు రాజ్యమునిచ్చి తాను సేనాపతిగానుండెను అనియు ఈ శ్లోకసారము.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) (సః=అ రాముడు,) ద్వి సీతాయమ్=ఇద్దఱు సీతలుప్రాప్తించునట్లుగా, యంవా=ఎవరో ఒకవానరుని, పాథోయన=సముద్రము యొక్క సేతవే=సేతువు కొఱకు, ఆదిదిదేశ=ఆదేశించెను.

భావము:- ఇద్దఱు సీతలు అనగా ఒక సీత, రెండవది సీతవంటి 'సేతుబంధము' అను పురుషార్థము లభించునట్లుగా నలుడు అను వానరుని సేతువుకట్టుమని ఆజ్ఞాపించెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) విశదే=శుద్ధమయిన, దివా=ముహూర్తమున, (సః=అ కృష్ణుడు), యథోపాయమ్=రాజనీతి ప్రకారము, వైతసేన=బెత్తముతో, యంతా=సేనాపతి, ఆసీత్=అయ్యెను.

భావము:- కృష్ణుడు యాదవుడగుటచే తన విజయఫలమయిన రాజ్యమును మాతామహుడయిన ఉగ్రసేనునకు ఇచ్చి తాను నీతి ప్రకారము సేనాపతి అయ్యెను.

విశేషములు:- 1) ద్విసీతాయం వద్ద కవి వ్యాఖ్య 'ఇద్దఱు సీతలు' అని ఉన్నది. అంతకన్న 'సీతాచ ఆయఃచ సీతాయౌ' ద్వౌ సీతాయౌ యస్మిన్ - అను విగ్రహముతో సీతయు సేతురూపమార్గమును/లాభమును కలుగునట్లుగా అని చెప్పిన బాగుండును. 2) వా=దీనికి 'అథవా=లేదా' అని అర్థము కవి వ్యాఖ్యలో

కలదు. కాని ఆ అర్థము నిష్ఫలము. కనుక దానిని 'యంవా' అని కలిపినచో 'ఎవడోఒక' అని అర్థము వచ్చును. ఈయర్థము అవసరము. 3) వైతసేన=అనగా 'బెత్తము' ధరించి అని 'కవి' అర్థము చెప్పెను. కాని వేతసములనగా వేత్రము= బెత్తము కాదు. నీటిలో మొలచు ఒక 'నాచు' మొక్క. అది ప్రవాహమునకు లొంగును. కనుక ఆ ప్రకారము కృష్ణుడు రాజనీతికి లొంగి తాను 'రాజు' కాక 'నియంతగా నుండెను. అని చెప్పుట సమంజసము.

అవ:- అథ రాక్షసైః సహ సంగ్రామోపస్థితః శ్రీరామః హనుమత్ప్రశంసామాహ.

శ్లో॥ వాయుజోఽనుమతో నేమే
సంగ్రామేఽ రవితోహ్ని వః
వహ్నితో విరమే గ్రాసం
మేనేఽతోఽ మనుజో యువా॥ 33

**అవతారిక:-** యుద్ధరంగమునకువచ్చిన రాముడు హనుమంతుని ప్రశంసించుటయు, కృష్ణుని సామర్థ్యమును ప్రశంసించుటయు ఇందు వర్ణితములు.

**ప్రతిపదార్థము:-** (రామపక్షమున) అరవితః=రవిలేనపుడు అనగా రాత్రిగాని, అహ్ని,పగలుగాని,సంగ్రామే=యుద్ధమున, వః=మీలో, వాయుజః=ఆంజనేయుడు అనుమతః=అనుమతింపబడెను, ఇమే=ఈ ఇతరవానరులు, న=అనుమతింపబడలేదు.

**భావము:-** వానరులారా! రాక్షసులు మాయావులు. వారితో ఏవేళలోనైనను యుద్ధముచేయుటకు ఆంజనేయునకు అనుమతి యిచ్చుచున్నాను. మీరు ఆయన నేతృత్వమునందే యుద్ధముచేయుడు అని రాముడు వానరులతో చెప్పెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) విరమే=ప్రళయమునందు, వహ్నితః=అగ్నివైపుగా, గ్రాసమ్=తన ఆహారమును, మేనే=ఎవడుతలచునో, యువా=ఆ యువకుడైన శ్రీకృష్ణుడు, అతః=ఇందువలన, అమనుజః=అమర్త్యుడు అనగా దేవుడు.

**భావము:-** ప్రళయకాలమున ఎవడు అగ్నిని గూడా తన ఆహారమునుగా చేసికొనునో ఆ యువకుడైన కృష్ణుడు మానవుడు కాడు. సాక్షాత్తు పరమాత్మ. అట్టి వానికి కంసాదులవధ, రాజ్యస్థాపనములు ఒక లెక్కలోనివి కావు.

అవతారిక:- అథ రామరావణయోః యుద్ధ ప్రసంగే వానరైః వ్యాకులితః రావణః రామేణ సహ న ప్రభావ మగాత్ - ఇత్యాహ.

శ్లో॥ క్షతాయ మా యత్ర రఘోరితాయుః
అంకానుగానన్య వయోఽయనాని।
నినాయ యో వన్యనగానుకారం
యుతారి ఘోరత్రయ మాయతాక్షః॥ 34

అవతారిక:-రామరావణ యుద్ధముతో వానరులతో చిక్కువడిన రావణుడు రామునిపైకి పోలేకపోయెను అను విషయమును, కృష్ణుడు పూర్వము బృందా వనమున రాక్షసులను సంహరించిన విషయము ఇందు వర్ణితములు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) యత్ర=ఎచ్చట, అంకానుగ=రామశరణార్థు లయిన, అనన్యవయః=సమానవయస్సుగల వానరులయొక్క, అయనాని= కదలికలు గలవో అచ్చట, ఇత=చిక్కువడిన, ఆయుః=ఆయుష్షుగలవాడై రావణుడు, రఘోః=రఘువంశీయుడైన రామునియొక్క క్షతాయ=దెబ్బకు, మా= సమర్థుడు కాకపోయెను.

భావము:- రామభటులయిన ఆంజనేయాది వానరుల మధ్యన చిక్కువడిన రావణుడు వారినుండి బయటపడలేకపోయెను. రామునితో యుద్ధమునకు రాలేకపోయెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) యః=ఏ, ఆయత=విశాలమయిన, అక్షః= కన్నులుగలకృష్ణుడు, వన్య=అడవిలోని, నగ=కొండలతో, అనుకారమ్=పోలికగల, యుత=కలిసిన, అరి=శత్రువులయొక్క ఘోర=భయంకరమయిన, త్రయమ్= త్రయమును అనగా 'పూతన, అఘాసురుడు, కేశి' అను ముగ్గురిని, నినాయ= మోక్షమును పొందించెనో అట్టి కృష్ణునికి అసాధ్యము ఏమిగలదు. (అని వెనుకటి శ్లోకముతో సమన్వయము)

భావము:- పూతన, అఘాసురుడు, కేశి అను భయంకర రాక్షసత్రయమును సంహరించి వారికిని మోక్షమును ప్రసాదించిన కృష్ణునకు అసాధ్యము ఏమి కలదు? అని కవి వ్యాఖ్య.

అవ:-అథ సపరివారస్య రావణస్య తారకే పరబ్రహ్మణి ప్రవేశోఽభూదిత్యాహ

శ్లో॥ తారకే రిపురాప శ్రీ
రుచా దాససుతాన్వితః।
తన్వితాసు సదాచారు
శ్రీపరా పురి కే రతా॥ 35

అవతారిక:- రావణునికి మోక్షము, కృష్ణుని మధురా నివాసము - వర్ణితములు.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) దాస=అనుచరులయిన కుంభకర్ణాదులతోను, సుత=సంతానమయిన ఇంద్రజిత్తు మొదలగువారితోను, అన్వితః=కూడిన, రిపుః =రామశత్రువయిన రావణుడు, తారకే=తరింపచేయు రామునియందు, శ్రీరుచా =మోక్షలక్ష్మీకాంతితో, ఆప=ఐక్యమును పొందెను.

భావము:- రావణుడు సకుటుంబపరివారముగా ఆ తారకరామునియందు ఐక్యము చెందెను.

ప్రతిపదార్థము:- (కృష్ణపక్షమున) తన్వితాసు=శరీరధారిణులయిన ఆ గోపికల యందు, శ్రీపరా=ద్వితీయ లక్ష్మివంటి ఒక గోపిక, సదా=నిత్యము, చారు= సుందరముగా, పురి=మధురయందు, కే=పరబ్రహ్మమయిన కృష్ణునియందు, రతా=ఆసక్తురాలయ్యెను.

భావము:-గోపికలలో ఒక గోపిక మాత్రము మఱొక లక్ష్మివలె మధురా పురమున కృష్ణుని కలిసియుండెను.

అవతారిక:- అథ రావణే సపరివారే హతే సతి లంకా హతప్రభా అభూత్ ఇతి విద్యున్మాలయా ఆహ.

శ్లో॥ లంకా రంకాగారాధ్యాసం
యానే మేయా కారావ్యాసే।
సేవ్యారాకాయామే నేయా
సంధ్యారాగాకారం కాలమ్॥ 36

అవతారిక:-రావణుడు సపరివారముగా మరణించెను. అందుచే లంక కళతప్పె ననియు, కృష్ణునివైభవమును గూర్చియు ఈ చివఱి శ్లోకమున వర్ణన జరిగినది.

ప్రతిపదార్థము:- (రామపక్షమున) యానే=రాముడులంకలోనికి ప్రవేశింపగా, కారా=దేవతల బందీగృహములయొక్క, అవ్యాసే=సంకోచముకాగా, లంకా=

లంకాపట్టణము, రంక=బీదవానియొక్క అగార=గృహము అను, అధ్యాసమ్= భ్రమకలుగునట్లు, మేయా=తెలిసికొనదగినది అయినది.

**భావము:-** లంకలోనికి రాముడు ప్రవేశించెను. కారాగారములనుంచి దేవతలను విడిపించెను. లంక బీదవానిగృహమువలె కళతప్పి కనబడెను.

**ప్రతిపదార్థము:-** (కృష్ణపక్షమున) సంధ్యారాగ=సంధ్యాకాల అరుణ వర్ణముగల, ఆకారమ్=ఆకారముగల పూర్ణచంద్రుని, రాకా=పూర్ణిమవలె, కాలమ్=కృష్ణుని వద్దకు, సేవ్యా=సేవనీయురాలయిన ఆగోపిక, యామే=తగిన సమయమున, నేయా=తీసికొనిరాదగినది.

**భావ:-** సంధ్యాకాలమున చంద్రునివద్దకు పూర్ణిమవచ్చినట్లు, ఆ గోపిక కృష్ణుని సకాలమున చేరుచుండెను. ఇచ్చటకు రామకృష్ణవిలోమకావ్యము సమాప్తము.

**సమాప్తిశ్లోకములు ఇవి:-**

శ్లో॥ గోదావరీ బ్రహ్మగిరేః సకాశాత్
సంప్రాపితా ప్రాగుదధిం ప్రయత్నాత్।
యేనర్షిణా సోఽపి పునః ప్రతీపం
ఆనేతుమద్రిం ప్రభవేత్కిమేతామ్॥

**అవతారిక:-** బ్రహ్మగిరియందు పుట్టిన గోదావరిని పూర్వము సముద్రముదాకా చేర్చిన మహర్షి (గౌతముడు) అయినను దానిని మఱల బ్రహ్మగిరి వద్దకు వెనుకకు త్రిప్పి నడపగలడా?

శ్లో॥ ఏవం విలోమాక్షర కావ్యకర్తుః
భూయాంస మాయాస మవేక్ష్య తజ్ఞాః।
జానంత్విమాం చిత్రకవిత్వసీమాం
దైవజ్ఞసూర్యాభిధ సంప్రదిష్టామ్॥

**భావము:-** కాని రామునివైపు వెళ్ళిన కవితా గోదావరిని త్రిప్పి వెనుకకు రామునివద్దకు, కృష్ణునివద్దకు వెళ్ళిన దానిని మఱల కృష్ణుని వద్దకు త్రిప్పగల యీ విలోమకవియొక్క ప్రయాస ఎంతటిదో గమనింపుడు. చిత్రకావ్యపు హద్దులు గమనించి 'సూర్యకవి సిద్ధాంతి' రచించిన యీ గ్రంథమును అభినందింపుడు.

**- సమాప్తమ్ -**

**శ్రీః**

